





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# రవీంద్ర నాథ్ టాగోర్ గీతాంజలి





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

రవీంద్ర

# గీతాంజలి

డా. మేరువ వేంకటేశ్వర రావు

**This Book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanam under their scheme "Aid to Publish Religious Books".**

తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయంతో ముద్రితం

# అంకితము

శారద కటాక్ష వీక్షణములు
నీపై మెండుగ ప్రసరింపగ
నీవు పలికినది కవిత్వమై
రంజిల్ల సురిసె నాంధ్రావని.

తెలుగు సాహితీ క్షేత్రమందు
పూచిన గరిక పూవుల మధ్య
సంపెంగ సౌరభముల తోడ
వెలసిన సుగంధ మూర్తి వీవు.

నీవు లేని సాహిత్య గోష్టి
శశాంకుడు లేని నభోతలము
తలపింప, నీవు చిరకాలము
నిలిచెదవు తెలుగు గుండెలందు.

కవితా యశశ్శశి కాంతులన్
విరివిగ విరజిమ్ము సినారెకు
వినమ్రుడనై అంకిత మిచ్చు
చుంటిని ఈ చిన్ని గ్రంథమును.

# మనవి

భారత భారతికి విశ్వవిఖ్యాతిని సముపార్జించిన రవీంద్రుని "గీతాంజలి", ఎందరో మహానుభావులకు ఆధ్యాత్మిక ప్రేరణకలిగించింది. ఫలితంగా ఎన్నో అనువాదాలు వెలువడినవి. ఆ మహానుభావులందరి స్ఫూర్తిని నాదిగా చేసుకొని, రవీంద్రుని గీతాలలోని ఆధ్యాత్మిక భావాలను సులభ శైలిలో యథాతథంగా ప్రస్ఫుటించే ఒక ఉత్కృష్ట గీతాంజలిని తెలుగు పాఠకులకు అందించాలనే ఉద్దేశముతో, అక్కడక్కడా వారి గేయాల శీర్షికలనూ, ఒకటి రెండు పంక్తులనూ ఈ గేయాలలో ఉపయోగించాను. ముఖ్యంగా చలం, చర్ల గణపతి శాస్త్రి, చిలుకమర్రి రామానుజాచార్యులు, యండమూరి సత్యనారాయణ రావు (సత్య), ఆచంట జానకీరామ్, ఇలపావులూరి పాండు రంగారావు గార్లకు నా కృతజ్ఞతలు.

అడగగానే లేదనకుండా పరిచయ పంక్తులు వ్రాసిన కీర్తి శేషులు నార్ల గారు నాకు చిరస్మరణీయులు.

ఈ పుస్తక ప్రచురణకై ఆర్థిక సహాయమందించిన తిరుపతి దేవస్థానాధికారులకు నేనెంతో ఋణపడియున్నాను.

ఈ గీతాంజలి పాఠకుల మన్ననలను పొందగలిగితే అదే నా శ్రమకు ఫలితమని సంతోషిస్తాను.

డా. మేరువ వేంకటేశ్వర రావు

# 1

## ఆత్మ

ఆద్యంత రహితమ్మైన
ఆత్మతో నన్ను మలచి
ముచ్చట తీర్చుకుంటివి.
ఈ నా శల్య పాత్రను
మాటి మాటికీ మరణ
శిక్షతో శూన్యం చేసి
మరల మరల ప్రాణమును
పోసి బ్రతికించుతావు.

కాయమనే ఈ చిన్న
రెల్లు పిల్లన గ్రోవిని
కనుమల కొండల మధ్య
నీతోనే వుంచుకొని
దానిలో శ్రావ్యమ్మైన
నిత్యనూతన స్వరముల
పాటలు పలికించావు.

నీ అమర కర స్పర్శకు
నా యందలి పసి మనసు
పులకించి పరవశమై
హద్దులు మీరి పలుకును
అనిర్వచనీయమ్మైన
నీ దివ్య సందేశము.

దోసిలి పట్టిన నా చిన్ని
చేతులలోకి కురుస్తాయి.
అంతులేని నీ కానుకలు.
యుగ యుగంబులు గతించినా
తరగని నీ కృపా జల్లును
స్వీకరించగ కాయమనే
ఈ కలశంబులో ఎంతో
రిక్తస్థలంబున్నది ప్రభూ!

# 2

## గాన సుధ

పాట పాడమని నువు
ఆజ్ఞాపించినపుడు
నా ఎద గర్వంతో
పొంగి విరుగునేమో
నని భ్రాంతికి గురియై
నీ మోమును కాంచిన
నా కను కొలుకులలో
కన్నీరు కరిగినది.

నా జీవితం భరించిన
అపశృతుల కర్కశత్వం
కరిగి మధుర రాగంగా
మారగ, నా ఆరాధన
అంబుధిని అధిగమించే
ప్రసన్న విహంగము వోలె
విస్తరించును రెక్కలను.

నా పాటల మధురిమలో
నీవు ముదము చెందెదవని,
ఒక గాయకుని గానే
నీ ఎదుటకు రాగలనని,
నాకు తెలుసునులే ప్రభూ !

నా గాన విహంగము పరచిన
విస్తృత రెక్కల కొనలతోనె
నా కలవి కాని నీ పదములు
తాకి తరించెదను ప్రభూ !

గానామృతపు కైపులో
ఆనందోన్మత్తుడనై
నన్ను నేను మరిచిపోయి
నా ఈశ్వరుడివైన నిను
సంకోచించక 'సఖుడా'
యని నే పలకరిస్తాను !

# 3

## నీ సంగీతం

నీవు ఎలా పాడుతావో
నేనెరుంగ నైతి స్వామీ !
మౌనముగా విస్మయంతో
సదా వింటాను నీ పాట.

నీ దివ్య సంగీత శిఖలు
భువి పై కాంతులు చిమ్మగా,
నీ సంగీత శ్వాస సురభి
విశ్వాంబరములు చుంబించ,
నీ పవిత్ర సంగీత ఝురి
శిలావరోధంబులు దాటి
పడి పడిగా పారు చున్నది.

నీ పాటలో రాగమ్మై
రాణించాలని నా ఎద
ఎంతో తహ తహ చెందును.
కాని నా గొంతు పెగలదు -
గొంతు పెగిలినా మాటలు
పాటలుగా ప్రభవించవు -
కలవరపడి విలపించెద.
నీ సంగీత మధుర శృతు
లల్లిన రాగాల వలలో
బంధించావు నా ఎదను.

# 4.

## సంకల్పము

ప్రభూ ! నా ప్రాణానికి ప్రాణం నీవు.
నీ సజీవ స్పర్శ నా సర్వాంగముల
పై ప్రసరించినదని గ్రహించిన నేను
నా కాయాన్ని కలుషితం కాకుండా
ఉంచేందుకు ప్రయత్నిస్తాను స్వామీ !

నా మదిలో జ్ఞాన జ్యోతిని
వెలిగించిన సత్యమూర్తివి
నీవేనని తెలిసిన నేను,
అసత్యమును నా తలంపుల
లోనికి రానీయకుండా
సదా ప్రయత్నించెద, ప్రభూ !

నా హృదయ గుడి గర్భంలో
నీ పీఠం పరచి వుందని
ఎరింగిన నేను, నా మదిని
క్రమ్మె సర్వ పాపములను
పారద్రోలి, నా ప్రేమను
విరిలా వికసింపచేసెద.

నా కార్యాచరణకు నీ శక్తే
కారణంబని తెలుసుకున్న నేను
నా కార్యంబు లన్నింటిలోనూ
నిను వ్యక్త పరుచుటకై సర్వదా
ప్రయత్నిస్తూ వుంటాను స్వామీ !

# 5

## వి(శాంతి

చేతిలోని పనులన్నియును
పూరించెద నేను తదుపరి -
ఈ ఒక్క క్షణం చనువిచ్చి
నీ చెంత కూర్చుండనిమ్ము.

నీ మోహన రూపమునకు
దూరమైన నా మనసుకు
శాంతి వి(శాంతులు లేవు.
నా సమస్త కార్యంబులు
దరిలేని (శమాంబుధిలో
అనంత కోటి (శమలుగా
భారమై బాధిస్తాయి !

ఈనాడు (గీష్మ ఋతువు
తన గొణుగుడు ధ్వనులతో
వేడి నిట్టూర్పులతో
నిలిచె నా కిటికీ కడ.
కుసుమ విరాజితమైన
పూదోట సభా స్థలిలో
(భమరంబులు సంగీత
వృత్తిని నెరపుచున్నవి.

పెల్లుబుకుతూ వున్న
ఈ నీరవ విరామ
ఝరీ (పవాహంలో
నీతో ముఖా[illegible]
కూర్చొని ఈ జీ[illegible]
పరమార్థము [illegible]
పరవశించి పాడెద :

# 6

## కోమల కుసుమము

ప్రభూ, జాగు చేయక
త్రుంచి గ్రహించుమీవు
ఈ కోమల కుసుమము –
లేనిచో ఈ పువ్వు
ఎండకు వాడి విడిలి
ధూళి లో రాలునని
నా ఎద కంపించును.

నీ ఎదపై కదిలే
పూవుల హారంలో
శోభించే భాగ్యము
దానికి కరువైనది.
దానిని బాధ పెట్టి
త్రుంచే నీ చేతుల
స్పర్శలతో నైనా
గౌరవించుము ప్రభూ !
నాకు తెలియకుండా
దినము గతించిపోయి
నీ పూజా సమయము
మించి పోవునేమో
నని భీతి చెందెదను.

ఈ పుష్ప సౌరభం
అతి పేలవమైనను
చిక్కని రంగులేక
కాంతి హీనమైనను
సమయమున్నప్పుడే
త్రెంచి నీ సేవలో
వాడుకొనుము స్వామీ !

## 7

## కవి మొఱ

మై నలంకరించుకున్న
సింగారము లన్నింటిని
తీసివైచె నా గీతము.
నగలు, వలువల సొగసుపై
మోజు క్షీణించి పోయెను.
“ఈ ఆభరణంబులు మన
కలయికకు అడ్డంకులై
మనిద్దరి మధ్య నిలుచును.
అవి తమ నిక్వాణములో
నీ తియ్యని గుస గుసలను
ముంచి కరిగించును ప్రభూ” !

కవిననే నా అహం, నీ
సమక్షములో సిగ్గుతో
క్రుంగి నశియించి పోవును.
కవివరేణ్యా! కూర్చుంటి
నీ పద పద్మముల చెంత –
నీ మృదు మధుర స్వరములను
ఆలపించే సామాన్య
మురళిగా నా జీవితము
మలచుకోనిమ్ము, స్వామీ!

# 8

## వేష భూషణముల ఖైదు

తల్లీ ! బాలునకు తొడిగెదవు రాచఠీవిగ
పట్టు వస్త్రాలు ; కంఠమున రత్న హారములు.
అడుగడుగునా అవి అతనిని నియంత్రించగా
ఆటల యందున్న ఆసక్తిని కోల్పోవును.

మట్టిలో మైలపడి చిరుగుననే భయంతో
నీ బాలుడు తోటి ప్రపంచానికి దూరమై
దీనుండై కదలక మెదలక క్రుంగి కుములును.

మాతృమూర్తీ ! ధరిత్రి పైని స్వాస్థ్య ధూళికిన్
దూరము చేసే చీనాంబరాల ఖైదువల్ల
మహోన్నత మానవ సమైక్య సందోహ జీవన
స్రవంతి ముఖ ద్వార ప్రవేశార్హత కోల్పోతే
నీ బాలునికి లభించే లాభమేమియు లేదు.

# 9

## ఆత్మ సమర్పణ

ఓ మూర్ఖుడా ! నిన్ను నీవే
నీ భుజాలపై మోయాలని
ప్రయత్నం చేయుచున్నావా !
ఓ భిక్షుకా ! నీ గడపలో
నువ్వే బిచ్చ మడుగుతావా !

సర్వ భారములు మోయు ప్రభువు
హస్తాలలో నీ భారమును
ఉంచినచో, విచారంబుతో
వెనుదిరిగి చూచే పని లేదు.

నీ కాంక్షల ఊపిరి సోకిన
దీపకాంతులు ఆరిపోవును.
నీ కాంక్ష అపవిత్రమైనది.
మలినం బైన హస్తాలతో
అది ఇచ్చిన ఏ కానుకలను
స్వీకరించనే వలదు నీవు.
పవిత్రమైన ప్రేమ ఇచ్చే
కానుకలనే స్వీకరించుము.

# 10

## నా గర్వము

నీ పాద పీఠమిది -
బీదలు నిరు పేదలు
అణగారిన ఆర్తులు
దిగజారిన భ్రష్టులు
బ్రతికే వాటికలో
మోపుము నీ పదములు.

నత మస్తకుడనై
నిన్ను కొలవాలని
యత్నించిన వేళ
నిరుపేదల మధ్య
అధమాధములలో
పాపాత్ముల మధ్య
విరాజిల్లు చున్న
నీ పాదంబులను
తాకలేకపోయె
నా ఆరాధనము.

దీనుల దుస్తులు ధరించి
పేదల హీనుల పాపుల
మధ్య తిరుగు నీ చెంతకు
రానివ్వదు నాగర్వము !

తోడు లేని బీదలకు
అణగారిన అర్తులకు
దిగజారిన భ్రష్టులకు
తోడు నీడై వుండే
నీ చెంతకు చేరుటకు
నా హృదయము వృధాగా
వెదికె తీరు తెన్నుకై.

# 11.

## ఎక్కడున్నాడు నీ దైవం ?

విడిచి పెట్టుమింక, ఈ మంత్ర
జపం, ఈ జపమాల గణితం
ఈ భక్తి గీత సంకీర్తన.
గుడిలో తలుపులు బిగించుకుని
ఒంటరిగా చీకటి మూలన
ఎవరిని పూజించుచున్నావు ?
నీ నేత్రములు తెరిచి చూడుము -
నీ దైవం నీ ముందు లేడు.

హలం పట్టి బీళ్ళు దున్నే
రైతుల మధ్యన వున్నాడోయ్ !
రాళ్ళుకొట్టి దారులు పరిచే
దరిద్రుల మధ్య వున్నాడోయ్ !
ఎండలోనూ వానలోనూ
ధూళిక్రమ్మిన దుస్తులతో
వారి వెంటనే వున్నాడోయ్ !
నీ మడి బట్టలు విసర్జించి
అతనిలా రావోయి క్రిందికి
ధూళి నిండిన ధరిత్రి పైకి.

ముక్తి ! ఎక్కడున్నది ముక్తి ?
మన స్వామి సైతము ముదముతో
ఈ సృష్టి బంధము తనపైన
వేసుకొని, శాశ్వతముగా అతను
మనతో కట్టుబడి వున్నాడు.

నీ పుష్ప దీప ధూపాలను
విసర్జించి, నీ ధ్యాన నిష్ఠ
నుంచి మేలుకొని బయటకి రా !
బట్టలు చిరిగి మరకలైతే
నీకు వచ్చిన ముప్పు యేమిటి ?
అతనిని కలిసి శ్రమలో, కృషిలో
చెమటోడ్చి బాసటగ నిలువుము.

# 12

## నా పయనము

నా యాత్రా కాలమూ ఎక్కువే -
పయనించే మార్గమూ దూరమే.
ప్రథమ తేజో రేఖా రథం పై
బయలిడి విశ్వపు కారడవులందు
క్రుమ్మరి పలు గ్రహ నక్షత్రాలపై
నా పద చిహ్నములను ముద్రించితి.

సుదీర్ఘమైన త్రోవయే నీ దరి
చేరే అతి సులభమైన మార్గము.
నేర్చుట క్లిష్టము - కాని నేర్పుతో
సులభమగును క్లిష్ట స్వర నియంత్రణ.

స్వగృహంబును చేరుటకై పాంథుడు
తట్టవలెను, ప్రతి పరగృహ ద్వారము.
అంతిమ గర్భగుడిని చేరుటకై
పలు బాహ్యలోక ప్రాకారాలను
చుట్టి చుట్టి తిరిగి రావలెకదా !

దారి తప్పిన నాకనులు నీకై
దవ్వు దవ్వులందు వెదుకుచుండగ
వాటిని మూసి 'ఇక్కడున్నావా' ?
అని నిన్ను పలుకరించితిని నేను.
''అయ్యో ఎక్కడ?'' అనే ప్రశ్న, నా
కేకలో కరిగి, వేయి కన్నీటి
నదులై పారి 'నేనున్నా' ననే
హామీ ప్రభవించిన వరద పోటు
ముంచె జగంబును జల ప్రళయములో!

## 14.

## నిష్ఠుర దయ

నా కోరికలు కోకొల్లలు -
దీనమైనది నా రోదన.
నీ కఠోర నిరాకరణలు
కాపాడు చున్నాయి నన్ను.
మదీయ జీవితంబు నందు
సఫల మయ్యెను నీదు కరుణ.

నేనడుగకనే దిన దినము
ఉత్తమ కానుకులకు నన్ను
అర్హునిగా చేస్తున్నావు
ఈ ఆకాశము, ఈ కాంతి
ఈ కాయం, ఈ జీవితం
ఈ మనస్సు, అన్నీ ఇచ్చి
అత్యాశల ఆపద నుంచి
కాపాడుచున్నావు నన్ను.

నే నలసి తారట్లాడిన
వ్యర్థ దినాలూ వున్నాయి -
మేలుకుని, జీవిత గమ్యము
కొరకై వెదుకుచూ తొందర
పడిన దినాలూ వున్నాయి.
కాని నిష్ఠురంగా నీవు
నాకు కనిపించక, నాతో
దోబూచు లాడుచున్నావు.

క్షుద్ర క్షణ భంగుర కాంక్షల
గండముల నుంచి కాపాడి
నిరంతర నిరాకరణతో
దినదినం నను సంస్కరించి
నీ పూర్ణ వాత్సల్యానికి
అర్హుడిగా చేస్తున్నావు.

# 15

## నన్నాజ్ఞాపించుము

నీ కొరకు పాటలు పాడుటకు వచ్చితిని నేను.
నీ చావడిలో ఒక మూల నాకు స్థానముంది.

నీ లోకంలో నాకే కర్తవ్యమూ లేదు.
నా వ్యర్థ బ్రతుకు వ్యర్థ రాగాలనే పలుకును.

చీకటి నడిరేయి గోపురంలో మౌనముగా
నిను పూజించే సమయము దగ్గిర పడినవేళ
నీ ముందు నిలిచి పాడమని ఆనతిమ్ము, ప్రభూ !

ఉదయ మారుతంలో పైడి వీణకు శ్రుతి పెట్టి
నపుడు రమ్మని ఆజ్ఞాపించి, నను గౌరవించు !

# 13

## కాంక్ష

ఏ పాట పాడాలని వచ్చానో
అది పాడకుండా మిగిలిపోయింది.

నా వీణెతంత్రులను సడలించుతూ
బిగించుతూ కాలం గడిపివేశాను.
లయకాలము సరిగా సరిపోలేదు.
పదముల కూర్పు లెస్సగ కుదరలేదు.
హృదిలో కాంక్షాతప్త బాధ మిగిలెను.

వికసించని మొగ్గ ప్రక్కన, తెమ్మెర
మాత్రము నిట్టూర్పులు విడుచు చున్నది.

నేను అతని మోమైన చూడలేదు.
వినలేదు అతని గొంతైనను నేను.
కాని ఇంటి ముందరి రహదారిపై
విన్నాను నేను, అతని మృదుపద ధ్వని

నేలపై అతని ఆసనంబు సిద్ధ
పరుచుటలోనే గడిచె దినమంతయు
వెలిగించలేదు ఇంటిలో దీపము –
కాన ఇంటికి పిలువనైతి నతనిని.

అతనిని కలవాలనే కోరికతో
నే నీ ఇల పై జీవిస్తున్నాను –
కాని అది ఇంతవరకు జరగలేదు.

# 14.

## నిష్ఠుర దయ

నా కోరికలు కోకొల్లలు -
దీనమైనది నా రోదన.
నీ కఠోర నిరాకరణలు
కాపాడు చున్నాయి నన్ను.
మదీయ జీవితంబు నందు
సఫల మయ్యెను నీదు కరుణ

నేనడుగకనే దిన దినము
ఉత్తమ కానుకులకు నన్ను
అర్హునిగా చేస్తున్నావు
ఈ ఆకాశము, ఈ కాంతి
ఈ కాయం, ఈ జీవితం
ఈ మనస్సు, అన్నీ ఇచ్చి
అత్యాశల ఆపద నుంచి
కాపాడుచున్నావు నన్ను.

నే నలసి తారట్లాడిన
వ్యర్థ దినాలూ వున్నాయి -
మేలుకుని, జీవిత గమ్యము
కొరకై వెదుకుచూ తొందర
పడిన దినాలూ వున్నాయి.
కాని నిష్ఠురంగా నీవు
నాకు కనిపించక, నాతో
దోబూచు లాడుచున్నావు.

క్షుద్ర క్షణ భంగుర కాంక్షల
గండముల నుంచి కాపాడి
నిరంతర నిరాకరణతో
దినదినం నను సంస్కరించి
నీ పూర్ణ వాత్సల్యానికి
అర్హుడిగా చేస్తున్నావు.

# 15

## నన్నాజ్ఞాపించుము

నీ కొరకు పాటలు పాడుటకు వచ్చితిని నేను.
నీ చావడిలో ఒక మూల నాకు స్థానముంది.

నీ లోకంలో నాకే కర్తవ్యమూ లేదు.
నా వ్యర్థ బ్రతుకు వ్యర్థ రాగాలనే పలుకును.

చీకటి నడిరేయి గోపురంలో మౌనముగా
నిను పూజించే సమయము దగ్గిర పడినవేళ
నీ ముందు నిలిచి పాడమని ఆనతిమ్ము, ప్రభూ !

ఉదయ మారుతంలో పైడి వీణకు శ్రుతి పెట్టి
నపుడు రమ్మని ఆజ్ఞాపించి, నను గౌరవించు !

# 16

## ధన్యుడను

ఈ జగతి యందు జరిగే
మహోత్సవ సంబరంలో
ముచ్చటగా పాల్గొనమని
నా కాహ్వానమందినది.
నా జన్మ ధన్యమైనది.
నీ సృష్టి సౌందర్యమును
తిలకించె నా నేత్రములు.
నీ ప్రకృతి మధుర ధ్వనులను
విందుగ వినె నా వీనులు.

ఈ ఉత్సవంలో వాద్యము
వాయించడం నా వంతు -
నా విధి పూర్తిచేసాను.

ఇప్పుడైనా గుడిలోనికి
ప్రవేశించి నిన్ను చూచి.
మౌన వందన మర్పించు
వేళ కాలేదా, ప్రభూ !

# 17

## సమర్పణ

వేచియున్నాను నేను
నా ప్రియసఖుని కొరకై -
అతని మృదుకరములందు
లీనమైపోవాలని.
ఆలస్య కారణమది -
అతని మోహములోపడి
ఎన్నియో పొరపాట్లకి
కారణమైతిని నేను.

ఈ సమాజ రక్షకులు
నన్ను బంధించుటకై
నీతి శాసనములతో
సంసిద్ధులై వచ్చిరి.
కాని వారికి చిక్కక
వేచియున్నాను నేను
నా ప్రియ సఖుని కొరకై -
అతని మృదు కరములందు
లీనమైపోవాలని

నేను దోషి నందురు ప్రజలు -
మాట వినని మూర్ఖురాలని
సదానిందించెదరు నన్ను.
వారి నిందలు సరైన వే
నని పూర్తిగా తెలుసు నాకు.

సంత రోజు ముగిసినది
సదా పనిలో మునిగిన
వారి బేర సారములు
పరి సమాప్తంబైనవి.
నన్ను కూడా రమ్మని
పిలిచారు వారందరు -
వారితో పోనందుకు
క్రోధంబుతో మరలిరి.
వేచియున్నాను నేను
నా ప్రియసఖుని కొరకై -
అతని మృదు కరములందు
లీనమై పోవాలని.

# 18.

## వ్యథిత

మబ్బులపై మబ్బులు క్రమ్మెను.
లోకంపై చీకటి చిమ్మెను.
ఓ ప్రియా ! నీ ద్వారము బయట
పడిగాపులు పడమని ఎందుకు
వదిలితివి నన్ను ఒంటరిగా ?

మధ్యాహ్నపు పని ఎద్దడిలో
మందిలోని మనిషిని నేను.
కాని ఒంటరి చీకటి రోజు
నీ కొరకు తపిస్తాను నేను.

నీ ముఖం చాటు చేసి
నన్నింత దూరం చేసి
పూర్తిగ వదలి వేస్తే
దీర్ఘ వర్ష ఘడియల్ని
నే నెట్లు గడప గలనో
ఎరుగకున్నాను ప్రియా !

దూరాన అంబర వీధి పై
అలుముకున్న చిమ్మ చీకటిని
కన్నార్పక గమనించు వేళ,
రోదిస్తూ పరుగిడు నా ఎద
అశాంత ప్రబల మారుతంతో.

# 19.

## నీ గాన మహిమ

స్వామీ, నీవు పలకనిచో
నా ఎదలో నీ మౌనాన్ని
నిండుగా నింపి, భరియించి -
చుక్కలు జాగరణము చేయ,
ఓర్పుతో నత శిరస్సుతో,
నిరీక్షించే నిశీధిలా
కదలక మెదలక రాయిలా
ఇచటనే వేచివుంటాను.

చీకటి తెరను చీలుస్తూ
ఉదయకాంతులు ప్రభవించును.
నీ మృదు మధుర కంఠ స్వరం
సువర్ణ ప్రవాహంలాగా
పొంగి నింగిని చీలుస్తూ
భూతలం పై వర్షించును.

అలా లెస్సగా కురిసిన
నీ కంఠ స్వర పదాలు
రెక్కలు ధరించి ధ్వనించు
ప్రతి విహంగ గూటి నుంచి.
నీ మృదు మధుర రాగాలు
అరణ్యా నికుంజాలలో
పువ్వులై వికసిస్తాయి.

## 20.

## మధుర సౌరభం

పద్మం వికసించిన రోజున
నా మనస్సు మనసులో లే
దానిని గమనించక పోతిని.
అదలాగే ఉండి పోయింది
నా చేతిలోని పూల సజ్జ
ఖాళీగా మిగిలి పోయింది.

అపుడపుడు ఖేదము
ముంచెత్తును నన్ను.
ఖేదము మిగిల్చిన
కలత కలల నుంచి
ఉలికి పడి లేచిన
శుభ తరుణంబులో
దక్షిణ దిశ నుంచి
వీచే గాలిలో
వింత సువాసనల
ప్రగాఢ మధురిమను
నే నను భవించితి.

అవ్యక్తమైన ఆ తియ్యదనం
రేపింది నాలో, ఎదను పిండే
వాంఛల వేదన – తలంచితి నేను,
'ఆ మధుర గాలి, సఫలత కొరకై
వెతుకు వేసవి ఉత్సుక ఊపిరని.'

పరిపూర్ణమైన
ఆ మాధుర్యము
దాపున వుందని,
అది నాదేనని
నాఎదలోనే
వికసించిందని
అపుడెరుగనైతి.

# 21.

## ప్రస్థానము

నా పడవను జలప్రవేశము
చేయించ వలెను వెంటనే.
నిశ్చేతన వ్యర్థ గడియలు
గడుపుతున్నాను ఒడ్డునే.
ఇదంతా నా దురదృష్టము.

వసంత ఋతువు రంగుల పూలు
పూయించి సెలవు తీసుకుంది.
వాడిన పువ్వుల భారంతో
తచ్చాడుతు వేచియున్నాను.

అలల మార్గాముల గల గల
పెంపొందగా, ఒడ్డు పైన
నీడల మార్గములో పండు
ఆకులు రెప రెప లాడుతూ
నేలపై రాలు తున్నాయి.

రెప్పలు వాల్చక ఏ శూన్య
ప్రపంచాన్ని చూస్తున్నావు ?
ఆ తీరము నుంచి వీచే
గాలిలో స్పందించు గాన
స్వరాలచే పులకరించిన
అనుభూతి కలుగుట లేదా ?

# 22.

## ప్రియ పాంథుడు

కుంభ వృష్టి కురియు
ఆషాఢ మాసపు
నీలి నీడలలో
నిఘా వారి కండ్లు
కప్పి, గుప్తముగా
అడుగులు కదపుతూ
నిశబ్ద రేయిలా
నడుచు చుంటివీవు.

పలు మారులు విసుదుగా వీచి
పలకరించిన తూర్పు గాలిని
సరకు చేయక ప్రభాత కాంత
మూసుకున్నది కనులను నేడు.
నిత్యము మెలుకువతో వుండే
నీలాంబరముపైన దళసరి
ముసుగు దట్టముగ కప్పబడెను.

అడవుల తోపులలో వినిపించే
పాటల గొంతులు మూగ పోయినవి.
అన్ని తలుపులూ మూసి వున్నాయి.
నువొక్కడివే నిర్జన దారిలో
ఒంటరిగా పయనించు పథికుడవు.
ఓ, నా ఏకైక ప్రియ మిత్రమా,
నా సాటిలేని అనుంగు ప్రియుడా,
నా ఇంటి తలుపులు తెరిచి వుంచితి.
నను మరచి కలలా సాగిపోకుము.

# 24.

## సూర్యాస్తమయము

పగలు గతించి పోతే
పక్షులు పాటలాపగ,
గాలి అలసి ఆగితే -
లోకం చుట్టూ నిదుర
దుప్పటి చుట్టిన భంగి,
సంధ్య వేళలలో అలసి
క్రుంకు కమల రేకులను
మృదువుగా మూసినట్లు -
చీకటి ముసుగు చిక్కగ
కప్పుము నా పై ప్రభూ !

యాత్ర ముగియక ముందే
ధాన్య సంచి నిండుకొన
పంచె చిరిగి దుమ్మవ్వ
బలమంతయు హరించగ
అలసిన పాంథుడి నుంచి
సిగ్గుని నిర్మూలించి,
దరిద్రాన్ని తొలగించి -
నిశి చిలికిన కరుణలో
పువ్వు పుష్పించినట్లు
పాంథుని జీవ శక్తిని

# 25.

## రాత్రి ఒడిలో

నే అలసి పోయిన రాత్రి
ఏ ఆరాటమూ లేక
నీ పైన భారము వేసి
నిద్ర దేవత ఒడిలోకి
నను ఒరిగి పోనీ, ప్రభూ !

నీరసించిన ఆత్మని
బాధించి బలిమి చేసి.
భక్తి లేని పూజలకు
పురికొల్పలేను, ప్రభూ !

అలసిన పగలు యొక్క
సొలసిన కనుల పైన
రాత్రి యొక్క ముసుగును
పరచి అలసట తీర్చి
మరునాటి ఉదయాన
క్రొత్త కాంతుల నిచ్చి
ముదముతో లేపేది
నీవేకదా, ప్రభూ !

## 26.

## నిష్ఠుర నిద్ర

నా స్వామి ఏగుతెంచి
నా చెంత కూర్చున్నా
మేలుకోలేదు నేను.
ఎంతటి నిష్ఠుర నిద్ర ?
నాదెంత దురదృష్టము !

నిశ్చల రేయిలో
వీణ చేతబూని
ఏతెంచెను అతను -
దాని మధుర శృతులు
నా స్వప్నములలో
ప్రతిధ్వనించాయి.

అయ్యో ! రాత్రులన్నీ
ఎందుకిలా వృథాగా
చేజారి పోతున్నవి ?
గాఢ సుషుప్తిలో నీ
ఊపిరే నా ప్రాణము
కాగా, నాకు మాత్రం
కనపడవెందుకు, ప్రభూ ?

# 27.

## ప్రేమ జ్యోతి

జ్యోతి ! ఎందున్నది దేదీప్య జ్యోతి
రగిలే నీ కామాగ్ని జ్వాలలతో
వెలిగించు కాంతులు చిమ్మే జ్యోతిని !

కలదు దివ్వె కాని తత్కాలిక లేదు
నా హృదయమా ! ఇదేనా నీ బ్రతుకు
ఇంతకన్న నీకు మరణమే నయం.

దుఃఖ దూతిక తెలిపెను, తలుపు తట్టి,
నీ స్వామి నిదురింపక ఈ చీకటి
ముసుగులో రమ్మనుచున్నాడు నిన్ను
సంకేత స్థలానికి తన్ను కలయ.

ఆకసమంతా మబ్బులు క్రమ్మినవి.
కుండపోతగా వాన కురుస్తోంది.
నన్ను ఉద్రేకపరిచే దేమిటో.
దాని అర్థ మేమిటో ఎరుగనైతి !

ఒకే క్షణం మెఱసిన మెఱుపుల కాంతి
నా కనుచూపుపై చీకట్లు క్రమ్మ
దిబిడరాత్రి నినదించిన సంగీత
స్వరములు, రమ్మని పిలవగ - బాటకై
తడవులాడుతూ వుంది నా హృదయం.

ఎందున్నది జ్యోతి ? దేదీప్య జ్యోతి !
రగిలే నీ కామాగ్ని జ్వాలలతో
వెలిగించు కాంతులు చిమ్మే జ్యోతిని -

ఉఱుము ఉఱిమింది. శూన్యంలో నుంచి
గర్జిస్తూ పరుగెత్తింది పవనం.
నల్ల రాతిలా వుంది నలుపు రాత్రి.
చీకటిలో గడియలు ముగియు నిష్ఫలం.
నీ ప్రాణాన్నే ఊపిరిగా పోసి
రగిలించి వెలిగించు ప్రేమ జ్యోతిని.

# 28.

## నికృష్ట జీవి

నను బంధించిన
మోహ బంధాలు
ఎంతో మొండివి.
ఆ బంధాలను
తెంచాలంటే
నా ఎద బాధతో
గిల గిల లాడును.

ఆ బంధాల నుంచి
సాధించాలి ముక్తి.
కానీ ఆ ముక్తిని
కాంక్షించుటకు నాకు
బహు సిగ్గుగా వుంది.

నీ హృదయ లోతులలో
వెలలేని గుణ సంపద
వున్నదనీ, నా మేటి
మిత్రుడవు నీవేనని
గాఢంగా నమ్మి నా,
నా గుండె గది నిండిన
ఈ కాకి బంగారము
ఊడ్చి పారవేయుటకు
నా మనసొప్పుట లేదు.

నా ఆత్మను కప్పిన
ఈ ఎముకల దుప్పటి
మృత్యు, రజస్సు ముసుగు.
ద్వేషిస్తాను దాన్ని -
అయినా కడుప్రేమతో
దాన్ని కౌగలించెద.

తరగని ఋణాలు,
భూరి ఓటముల
సిగ్గుభారమై
నాకు చెందేది
ఇమ్మని నీకడ
నిలుచున్న వేళ,
నా ప్రార్థనలను
ఒప్పెద వేమో
నని భయముతో
వొణికి పోతాను.

# 29.

## వైరుధ్యం

నా నామముతో పిలువబడే
ఈ శరీరమనే ఖైదులో
రోదిస్తూ వుంది నా ఆత్మ.
నిరంతరమూ దాని చుట్టూ
కడుతున్నా కీర్త ప్రతిష్టలు
చాటే అందమైన గోడను.
రోజు రోజుకీ నింగిలోకి
ఎదుగుతున్న పేరు ప్రతిష్టల
ఆ గోడ చీకటి నీడలో
మాయమగును నా అంతరాత్మ.

నా దర్పానికి చిహ్నామైన
నా పేరు ప్రతిష్టల గోడకి
ఏ చిన్న రంధ్రము పడకుండ
మట్టి ఇసుకల పూతలు పూచి
ఎంతో శ్రద్ధ కనబరిచినా,
మాయమగును నా అంతరాత్మ.

# 30.

## నా అహం

ఒంటరిగా నియమిత
సంకేత స్థలానికి
బయలు దేరితి నేను,
కానీ, ఎవడు వీడు
నీరవ చీకటిలో
నా వెనక నీడలా
వెంబడిస్తున్నాడు ?

వాడి సాంగత్యమును
తప్పించుకొనుటకై
ప్రక్కనకు తొలగినా
వీడదు వాడి తోడు.

తూలుతూ త్రుళ్ళుతూ
భూమిపైని దుమ్మును
పై పైకి రేపుతూ,
కలుపు తన పెనుగొంతు
నా పలుకు పలుకునకు.

వాడు నా అహానికి
బాహ్యరూపం, ప్రభూ !
సిగ్గులేని శిఖండి.
వాడ్ని వెంటేసుకొని
నీ ద్వారము చెంతకు
నే రావాలంటే
లజ్జగ వుంది, ప్రభూ !

# ఖైదీ

ఓ ఖైదీ, నిన్నిలా
ంధించిన వారెవరు ?'

నన్నీ సంకెళ్ళలో
ట్టింది నా ప్రభువే'

కనకానికి, అధికారానికి
ాసుండనై ధరిత్రిలోని
నవంతుల తలదన్నాలని
ప్రభువు ధనాన్ని దాచాను,
జానాలో నిదురరాగా
వశించితి ప్రభువు పాన్పు పై.
లుకొని చూడ, కనుగొంటిని
ా కోరికల ఖజానాలో
ందీగ మిగిలి పోయానని'.

ఓ ఖైదీ, బలవంతమైన
ఈ సంకెళ్ళు చేసిందెవరు ?'

ఈ గొలుసును ఇంత దృఢంగా
ూపొందించింది నేనే.
జేయమైన నా శక్తి, ఈ
పపంచాన్ని నాకు బానిసగ
సి, ఏ అడ్డంకులు లేని
్వేచ్ఛను ఇస్తుందని భ్రమించి
వళ్ళు కణకణలాడే
ంటలలో, సుత్తుల సమ్మెట

పోటులతో కొట్టి మలిచాను
ఈ సంకెళ్ళ ప్రతి లంకెనూ,
ఇలా శ్రమించు పనుల పూర్తప్పుడు
హరింపుటకు వీల్లేనివైన
ఈ పగలని విరగని సంకెల
లంకెలు చివరకు నన్నే, తను
ఖైదీగా ఖైదు చేసాయి.

# 32.

## నీ ప్రేమ

ఈ ఇలలో నను ప్రేమించిన
నా బంధువులు, బంధాలతో
నను భద్రంగా బంధింతురు,
కాని వారి కంటె మిన్నగా
ప్రేమించే నీవు, బంధాలు
తెంపి స్వేచ్ఛ నిచ్చావు నాకు.

నేను తమని మరిచి పోదునని
నను ఒంటరిగ వదిలి వుండరు.
దినములు దొర్లి పోతున్నాయి.
నీవు మాత్రమే కనిపించవు.

ప్రార్థనలో నిన్ను మరిచినా
ఎదలో నిన్ను నిలుపకున్నను,
నా ప్రేమ కోసం నీ ప్రేమ
నిరీక్షిస్తూనే వుంటుంది.

# ౩౩.

## అంతశ్శత్రువులు

పగటి వెలుగులో ఏతెంచిరి
వారు మదీయ మందిరమునకు.
తలదాచుకొనుటకు కాస్తంత
చోటు ఇచ్చినచో చాలనిరి.

నా ప్రభువుకు చేయు పూజలో
తాము కూడ సహాయము చేసి
దైవ ప్రసాదములో తమ వంతు
మాత్రమే స్వీకరింతు మనిరి.
అవ్విధంబున ప్రాధేయపడి
అణుకువతో మౌనముగా ఒక
మారుమూల ఉపస్థితులైరి.

కాని నడిరేయి చీకటిలో
అల్లకల్లోలంగా గర్భ
గుడిలోని బలిమితో చొరబడి
మలిన హస్తాలతో స్వామికి
అర్పించిన నైవేద్యంబును
కాంక్షతో సంగ్రహించి మైల
పరచిరి పవిత్ర మందిరమును.

# 34.

## నాలో మిగుల్చుము

ఏ స్వల్పమైన నా మదిచే
నీవే నా సర్వస్వంబని
చాటెదనో ఆ స్వల్పమదిని
నాలో మిగిల్చి వుంచు ప్రభూ !

ఏ స్వల్ప సంకల్పము చేత
ఎటు తిరిగినా నీవే ననే
అనుభూతిని అనుభవించుతూ
అన్నిటికీ నిన్నాశ్రయించి,
క్షణం క్షణం ఈ నా ప్రేమని
నీకర్పించి వేయాలనే
ఆస్వల్ప సంకల్పంబునే
నాలో మిగిల్చి వుంచు ప్రభూ !

ఏ స్వల్ప దర్ప రాహిత్యము
వలన నిను మరవక మసిలెదనో
అట్టి దర్పరాహిత్యమునే
నా మదిలో మిగుల్చుము ప్రభూ !

ఏ స్వల్ప శృంఖలాల చేత
నీ అభీష్టమునకు కట్టుబడి
నీ ధ్యేయంకై బ్రతికెదనో
అట్టి నీ ప్రేమ సంకెళ్ళను
నాకై మిగిల్చి వుంచు ప్రభూ !

## 35.

## స్వాతంత్ర్య స్వర్గము

ఎచట మనసు నిర్భయంగా వుంటుందో
ఎచట జనులు గౌరవంగా మనగలరో
ఎచట జ్ఞానం ఉచితంగా లభించునో
ఎచట సంకుచిత సంసార గోడలచే
జగతి ముక్కలుగా విభజించబడలేదో,
ఎచట సత్య గర్భిత లోతులలో నుంచి
మనుషుల మాటలు బహిర్గతమవుతాయో,
ఎచట అలసట యెరగని కృషి పరిపూర్ణత
వైపుకు తన చేతులను సాచు చుండునో,
ఎచట వివేక తరంగిణి నిర్మల నీరు
నిర్జీవ ఆచార విషాద ఎడారుల
ఇసుక లోకి దారి తప్పిపారలేదో,
ఎచట మనసు విశాల భావములలోకి,
క్రియలలోకి నీచే నడుపబడుతుందో -
అట్టి స్వేచ్ఛా స్వర్గమందు నా దేశము
మేలుకొనేటట్లు వరము నిమ్ము తండ్రీ !

# 36.

## ప్రార్థన

నిన్ను కోరే ప్రార్థన ఇదే ప్రభూ !
నరుకు, నా హృదయ దారిద్ర్య వేరును.

జీవిత సుఖ దుఃఖములను సమముగా
భరించెడి హృదయ ధారుఢ్యము నిమ్ము.

మానవ సేవలోనే నా ప్రేమను
సఫలం చేసుకునే శక్తిని యిమ్ము.

పేదలను త్యజించని శక్తిని యిచ్చి
బలోన్మాదుల ముందు మోకర్లిలని
ధైర్య చిత్తము ప్రసాదించుము నాకు.

దైనందిన అల్ప సమస్యల నుంచి
నా మనసు ఉత్కృష్ట భావాలలో
పయనించే శక్తిని ప్రసాదించుము.

నా శక్తిని నీ ఇచ్ఛకు, ప్రేమతో
అధీనం చేసే శక్తి నా కిమ్ము.

# 37.

## దైవేచ్ఛ

నా శక్తులుడిగి నా జీవిత యాత్ర
ఇంక ముగిసిందని తలంచిన వేళ
నా ముందున్న బాటను మూసి వేయగ
భుక్తికై తెచ్చిన పట్టెడు గింజలు
నిండుకోగా, అవ్యక్త మౌనంబు
దాల్చి, ఓ మూల ఆశ్రయంబు పొందు
సమయ మేతెంచెనని తెలిసికొంటిని.

కానీ నీ సంకల్పములో నాకు
అంతము లేదని గ్రహించాను నేను -
నాలుకపైన ఓలలాడిన పాత
పదాలు సమసిపోగా, క్రొత్త మధుర
సంగీత స్వరాలు ఎద చీల్చి పైకి
ఉప్పొంగును, పాత త్రోవలు మాయము
కాగా అద్భుత కొంగ్రొత్త దేశము
సాక్షాత్కారమగునని గ్రహించితిని.

# 38.

## నువ్వే కావాలి నాకు

'నాకు కావలసింది నువ్వే -
నువ్వు మాత్రమే' నని నా ఎద
నిరంతరమూ జపించ నిమ్ము.
దివారాత్రులు భ్రమింపజేయు
నా కోరికల కేంద్రము శూన్య
బూటక బిందువని గ్రహించితి.

వెలుగుకై పెట్టిన విన్నపము
చీకట్లలో రేయి దాచిన
భంగి, నా అచేతన స్రవంతి
లోతులలో మ్రోగుతూ వుంది -
'నాకు కావలసింది నువ్వే
నువ్వు మాత్రమే' అనే కేక.

శాంతిని భగ్నము చేయుటకై
తన సర్వ శక్తితో తాకిన
తుపాను తుదకు శాంతి లోనే
అంతమైనట్లు, నా పితూరి
నీ ప్రేమను గాయ పరిచినా
నిరంతరంబది విలపించును -
'నాకు కావలసింది నువ్వే
నువ్వొక్కడివే మాత్రమే' అని.

# 39.

## నిస్వాన మూర్తి

మమతలు వీడి పాషాణమైన
మనసు బీటలు పడిన వేళలో
కరుణధారలు కురియ రావోయి !

జీవన మధురిమ తొలగిన వేళ
సంగీత సుధ విరియ రావోయి !

బ్రతుకు కొలువుల ఘర్షణ ఘోషలు
నను చుట్టు ముట్టి మూసిన వేళ
నీ శాంతి విశ్రాంతుల జల్లులు
కురియరావోయి, నిస్వాన మూర్తి !

క్రుంగిన నా ఎద మూరు మూలన
నక్కి కూర్చున్న వేళ తలుపులు
బ్రద్దలు గొట్టి రాజతేజములు
అలరంగ, నన్నరయ రావోయి !

భ్రాంతి భ్రమలతో, కాంక్ష మనసును
చీకటి చేయ, 'పవిత్రమూర్తీ !
చైతన్య ప్రభూ !' నీ ఉరుముతో
మెరుపుల కాంతితో కదలి వమ్మా.

# 40.

## నీ కృపా వృష్టి

ప్రభూ ! ఎన్నో దినంబులుగా
నీ కృపా వృష్టికిన్ కరువై
నా ఎడారి హృద్యాకాశం
నీలి మేఘాల ముసుగు లేక
వాన చినుకుల జల్లులు లేక
ఎండి బీటలు వారిన వేళ
చావు చీకట్లను నింపుకుని
మెఱుపు కొరడాల చఱుకులతో
నీ ఉగ్ర భీషణ తుపానును
నింగి నలుమూలలు దిగ్భ్రాంతి
చెందునట్లుగా పంపించుము.

కాని నా హృదయాన్ని నిస్పృహ
నిప్పు కొలిమిలో భగ భగమని
కాల్చి బూడిద చేస్తున్న ఈ
నిశ్చల మౌన కఠిన కర్కశ
చిచ్చును వెనుకకు మరలించుము.

తండ్రి కుపితుడైన వేళలో
తల్లి కన్నీటి చూపు వంటి
నీ అనుగ్రహ మేఘాన్ని, పై
నుంచి ప్రాలనిమ్ము నాపైన.

## 41.

## నీకై వేచి యుంటిని

అందరి చాటున నిలిచి
క్రీ నీడిలలో ఎచట
దాగితివో నా ప్రియా !
వారు నిన్ను లక్ష్య పెట్టక
త్రోసి సాగిపోతున్నారు
దూళి దూసరి బాట పైన.

నీకై తెచ్చిన నైవేద్యమును
ఇక్కడ పరచి గంటల కొలదీ
నీ రాకకై వేచి యున్నాను.

దారిపోయెడి వారు
ఏతెంచి ఒక్కొక్క
పూవునీ తీసుకొని
తరలి పోతున్నారు.
నా సజ్జ దాదాపు
ఖాళీగా అయినది.

ఉషోదయం గడిచింది.
మధ్యాహ్నం ముగిసింది.
సాయంత్రపు నీడలో
నిద్ర మత్తులో కనులు
ఎంతో బరువెక్కాయి.
ఇళ్ళకు తరలిపోయే
పురుషులు నను క్రీగంటి
చూపులతో చూసి చిఱు

నవ్వులొలికించి నన్ను
సిగ్గుతో నింపుతారు.
నా ముఖాన్ని పమిటతో
కప్పి ముష్టిదానిలా
కూర్చుండి యున్నప్పుడు
'ఏం కావాలని' వారు
అడిగితే కనులు వాల్చి
బదులే పలుకను నేను.

'తప్పక వస్తావని, నీవు
నాకు మాట ఇచ్చావనీ
నీకై వేచి వున్నానని
వారికి ఎలా చెప్పగలను'.

నా ఈ దరిద్రాన్ని కట్నముగ
దాచి ఉంచానని చెప్పుటకై
ఎంతో సిగ్గుగా వుంది నాకు.

ఈ అభిమాన ధనమును,
గూఢ హృద్యాంత రంగ
మందు హత్తుకుంటాను.
పచ్చిక పైన కూర్చొని
నింగి పై చూపు నిలిపి
నీ ఆకస్మికా గమన
వైభవాన్ని తలచుకుని
కలలను కంటిని నేను !

'సువర్ణ పతాకాల రెపరెపలతో
దేదీప్యమానముగా వెలుగుచున్న
రథము పైన ఏతెంచి, వేచియున్న

ప్రేక్షకులు విస్మయముతో తిలకించ,
నీ ఆసనము దిగి ధూళి యందున్న
ఈ బిచ్చుగత్తెను నీ రథముపైన
నీ చెంత కూర్చుండ బెట్టినప్పుడు,
గ్రీష్మ గాలికి కంపించే లతలా
లజ్జాగర్వంబులతో వణికితిని'

కాలము కరిగిపోయెను.
నీ రథ చక్ర రవళులు
ఇంకా వినపడలేదు.
కోలాహలముతోనూ
రొదల రవళులతోనూ
వైభవాకర్షణతో
ఊరేగింపు లెన్నో
కదలి తరలి పోయినవి.
వాటన్నింటి వెనకా
నీడలో మౌనంగా
నిలిచింది నీవేనా ?
వ్యర్థమైన వాంఛతో
గుండెపగిలే రొదతో
నేనొక్కతినే ఇచట
నీకై వేచి యుంటిని !

# 42.

## సాగర విహారము

కేవలం నీవు నేను మాత్రమే
నావలో ప్రయాణము చేయుదుమని
ప్రభాతమే సంకేతమందినది !
దేశము తెలియని, అంత మేలేని
ఈ మన తీర్థ యాత్రా విశేషము
ఇలలో ఇంకో ప్రాణికి తెలియదు.

తీరమేలేని సాగరము మీద
మౌనంగా వినే నీ చిరునవ్వు
చూచి, పదముల బంధాలను త్రెంచి
అలల వలే స్వేచ్ఛగ ఉప్పొంగును
నా పాటలు మధుర స్వరంబులతో.

నియమిత సమయ మింక కాలేదా ?
చేయవలసిన కార్యములున్నవా ?
సంధ్యవ్రాలె సముద్ర తీరముపై.
క్షితి వెలుగులో కడలి విహంగములు
తిరిగి తమ గూళ్ళకి వస్తున్నాయి.

లంగరు గొలుసు లెప్పుడెత్తెదరో ?
సూర్యాస్త సమయమందలి కడపటి
కిరణము వలె ఈ నావ నిశిలోకి
ఎపుడు మాయమగునో ఎవరికెఱుక ?

# 43.

## విస్మృత క్షణాలు

నిర్లక్ష్యముగ నీరాకకై
నేను వేచి వుండని రోజున
నాకు ఎఱుక లేకనే నీవు
సామాన్యుడిలా నా ఎదలో
అడుగక, చెప్పక ప్రవేశించి
నా జీవిత బుద్బుద క్షణముల
పైన నీ అమరత్వపు ముద్ర
గాఢంబుగా ముద్రించితివి.

ఈనాడు తలవని తలపుగా
కాలగర్భంలో మాయమైన
ఆ విస్మృత క్షణంబులు తిరిగి
కన్నుల ఎదుట కదలాడంగ
వాటిపై నీ ముద్రను గాంచి
చకితుడనై పరీక్షించగా
వీక్షించితిని కనులు చెదరగ
ధూళి యందున విరజిమ్మ బడి
నే విస్మరించిన, నా విగత
జీవిత తృణ క్షణాల నవ్వుల
బాధల సమ సంగమ చిత్రం.

జీవిత ధూళిలో నా కుర్ర
తనపు చేష్టలు చూచి ఘృణత్
విముఖుడవై తరలి పోలేదు.
నా క్రీడా మందిరంబులో
నే విన్న ఆనాటి నీ పద
ధ్వనులే, తారా జగత్తులో
నేడు ప్రతిధ్వనిస్తున్నాయి.

## 44.

### నిరీక్షణ

దారి ప్రక్కన కాలం గడుపుతూ
వెలుగును తరిమే నీడను చూస్తూ
వేసవి వేడి వెనువెంట వచ్చే
వర్షపు చినుకుల జల్లును చూస్తూ
వుంటె ఎంతో హాయిగ వుంటుంది.

తెలియని గగనాల నుంచి వచ్చిన
వార్తావహులు నన్నభినందించి
వడిగా పోయెదరు విను వీధిపై.
ప్రక్క నుంచి తరలిపోయే గాలి
శ్వాసలో గల మాధుర్యంబుతో
పులకించె నా హృదయాంతరంగము.

ప్రత్యూషము నుంచి సంధ్య వరకూ
నా తలుపు ముందు కూర్చుని నీకై
నిరీక్షించెద - నాకు తెలుసునులే
నిన్ను చూచే సంతోష సమయం
ఆకస్మాత్తుగా ప్రాప్తిస్తుందని.

ఈ లోగా నేను చిరునవ్వుతో
గానము చేయు చుందును ఒంటరిగా
ఈ లోపల వాగ్దాన పరిమళం
విస్తరించును అనిల జగమంతయు

## 45.

## నా స్వామి

వినలేదా నువ్వతని విస్స్వాన పదరవము ?
ఏతెంచు, ఏతెంచు, ఏతెంచు, నా స్వామి !

ప్రతి క్షణం, ప్రతి యుగం, ప్రతి దినం, ప్రతి రాత్రి
ఏతెంచు, ఏతెంచు, ఏతెంచు, నా స్వామి !

పరి పరి విధాల పరుగిడే మనసుతో పాటు
పాడు కొంటిని పాటలెన్నియో, కాని ఆ
పాటల స్వరంబులన్నియు సదా ప్రకటించె
'ఏతెంచు, ఏతెంచు, ఏతెంచు, నా స్వామి !'
వేసంగి చైత్ర పరిమళ దివసంబులలో
కారడవిలో కాలిబాటపై కదులుతూ
ఏతెంచు, ఏతెంచు, ఏతెంచు, నా స్వామి !

ఆషాఢ వర్షపు చీకటి రాత్రుల యందు
మేఘాల రథముపై ఉఱుముల శబ్దముతో
ఏతెంచు, ఏతెంచు, ఏతెంచు, నా స్వామి !

నా దుఃఖాతి దుఃఖములందు నా ఎదపై
బలముగా అదిమిన అతని పవిత్ర పాదముల
పైడి స్పర్శ నా హర్షానికి వెలుగు నిచ్చు !

# 46.

## నీ చరణ ధ్వనులు

ఎంత సుదీర్ఘ కాలము నుండి
నను కలవాలని దగ్గరగా
వస్తున్నావో నాకు తెలియదు.
నీ రవి తారకలు నా నుంచి
నిను కలకాలం దాచలేవు.

అనేక ఉదయ సంధ్యల యందు
నీ చరణ ధ్వనులు వినిపించెను.
నీ దూతా నా హృదిలో జొరబడి
నన్ను రహస్యముగా పిలిచెను.

నే డెందుకో నా ప్రాణముప్పొంగి,
హర్ష ప్రకంపనలు నా హృదయంలో
ఎంతగానో స్పందించు చున్నాయి.

నా ఇహలోక కార్యములన్నింటిని
త్యజించే సమయ మాసన్నమైనది.
అనిల ప్రచలిత అవ్యక్త సౌరభం
నీ మధుర సన్నిధిని ప్రకటిస్తోంది.

# 47.

## సాయుజ్యము

స్వామి నిరీక్షణలో రేయి గతించెను.
వేకువఝాము అలసి నిదురించు వేళ
నా స్వామి తటాలున ద్వారము చెంతకు
ఏతెంచునేమోనని భయముగ వుంది -
చెలులారా, అతని రాకకై తలుపులు
తెరిచి వుంచండి - అతనిని ఆపకండి.

అతని అడుగుల చప్పుడు
నన్ను లేపక పోతే
లేపొద్దు మీరెవ్వరు.
పక్షుల కిలకిలలతో
ఉదయ భానోత్సవమున
కైపెక్కి కదము త్రొక్కు
గాలితో నా నిద్రకు
భంగము కలుగ కూడదు.
నా ప్రభువే తటాలున
తలుపు చెంత కొచ్చినా
నిరాటంకంగా నను
నిద్రపోనివ్వవలెను.

ఆహా ! ఏమి నిద్ర,
అమూల్యమైన నిద్ర -
అతని కర స్పర్శతో
కరిగిపోయే నిద్ర.

నిదుర చీకటిని చీల్చుకుంటూ
ఎదుటి కొచ్చే కమ్మటి కలలా
నా స్వామి ఎదురై ఎదుట నిలిచి
ఒలికించు చిరునగవుల జిలిబిలి
వెలుగుకు పులకించి కను రెప్పలు
విస్తారమై పరిశీలించే
ముగ్ధ ముకిళిత నేత్రాలు నావి.

నా చూపులు చూచే అన్ని
వెలుగులకున్ తొలి వెలుగుగా
నా కన్నులు కాంచే అన్ని
రూపములకు తొలి రూపముగ
కనిపించాలి అతను నాకు.

జాగృతమైన నా ఆత్మ
అతని చూపుల జల్లులో
పొందాలి తొలి పులకింపు.
అలా మేలుకొని నను నే
నెరిగిన దివ్యక్షణంలో
లీనమవ్వాను నా ఆత్మ
ఆతని అంతరాత్మలో.

# 48.

## నేనెంత భయ పడితిని !

తొలి ప్రొద్దుటి
నిస్వాన సాగరం
కిలకిల పక్షుల
గల గల గానంతో
కల కల నవ్వెను.
దారి పంచన
రెమ్మలపై విరిసిన
మొగ్గల మనసులు
ముదముతో మురిసెను.
చెదిరిన మబ్బుల
చిరుగుల నుంచి
చిమ్మెను ధరిత్రి పై
పసిడి కాంతులు.
ప్రకృతి పరచిన
అంద చందములను
గమనించక సాగిపోతిమి
మా గమ్యము వైపు.

పాడలేదు మేము
ముదిగొలిపే పాటలను –
ఆడలేదు మేము
ఒళ్ళలిసే ఆటలను.
బేర సారములకైనా
కాలుజాన లేదు [illegible]

ఒక నవ్వునైన చిందలేదు.
దారిలో తచ్చాడనూ లేదు.
పరుగెత్తే కాలంతో పాటు
వేగంగా అతి వేగంగా
పరుగులపై పయనించితిని.

నడి నెత్తిపై నిలిచిన
సూర్యుని తాపానికి
తాళలేక, గువ్వలు
నీడల చల్లదనంలో
హాయిగా కూయు చున్నవి.
మిట్ట మధ్యాహ్నపు
మండుటెండలో
వీచే వేడి గాలికి
పసిడి చాయల
పండుటాకులు
గిర గిరా తిరుగుతూ
నృత్య భంగిమలు
నెరపు చున్నవి.
మర్రి నీడలో
గొల్ల పిల్లడు
అదమరచి
నిదురించి
కలలు కనె.
నీటి ఒడ్డున
పచ్చిగడ్డిపై
ఒళ్ళలసి
తీపు తీరగ
నడుము వాల్చితి.

ఈ చోద్యము చూచి
నా సహచరులు
తిరస్కారముతో
తలలు పంకించి
నన్నుపహసించి,
విశ్రమించక
తిరిగి చూడక
దూరాన క్రమ్మిన
నీలి నీడలలో
కలలా కలసిపోయిరి.
పచ్చని పొలాల
నధిగమించి
మండే కొండల
నధిరోహించి
వింత దేశాలను
దాటుకుంటూ
కనుమరుగై
కాలగర్భంలో
కలిసి పోయిరి.
అంతులేని
త్రోవ పై
నిబ్బరంగా
సాగిపోయిన
అచంచల
ధీరుల్లారా -
ఇదే నా జోహార్లు

మీ చీవాట్లూ
వెక్కిరింపులూ
నను లేలెమ్మని
ఉడికించాయి.
కాని శక్తులుడిగిన
నేను స్పందించలేదు.
అంతా అయిపోయిందని
అత్యంత హతాశుడనై
తియ్యటి పరాభవ లోతుల్లో
సంతోషపు మసక నీడల్లో
కను మూసి కదలనైతిని.

సూర్య కిరణములు
అందముగా అలుముకున్న
పచ్చటి నీడల
చల్లని నీడల
చల్లని ప్రశాంతత
నా గుండెలపై
అలుముకున్నాయి.
నేనెందులకీ ప్రయాణం
ప్రారంభించితినో
పూర్తిగా మరచి
నీడల వ్యూహంలోకి
పాటల పారవశ్యంలోకి
ఏ పెనుగులాట లేకుండా
నా మనసునప్పగించి
మత్తుగా నిదురించితి.

నిదుర లేచి
కనులు తెరిచి
తిలకించితి -
నా పంచన
నీవు నిలుచుని
నా నిదురను
నీ నగవుతో
నింపుతున్న
నీ సుందర
వదనంబును.
నిను చేరు బాట
దీర్ఘమైనదనీ,
అలయించునట్టిదనీ
నీ సాన్నిధ్య ప్రాప్తి
బహు కష్టతరమనీ
నేనెంత భయపడితిని !

# 49.

## నా గానములో నీ పారవశ్యం

స్వర్గ సీమలోని
సింహాసనమును
వీడి విచ్చేసితివి
మదీయ కుటీర
ద్వారము చెంతకు.

మారుమూల
ఒంటరిగా
నేపాడుచున్న
పాటలలోని
మధుర రాగాలు
విన్నాయి నీ వీనులు
అంతే -
వైకుంఠవైభవాన్ని
వద్దని వదలి
నిలుచుంటివి
మదీయ కుటీర
ద్వారము చెంత.

నీ దివాణంలో
సంగీత పండితుల
సంఖ్య కోకొల్లలు.
అచట నిత్యమూ
తియ్యని పాటల
మధుర శృతులు

ఎడ తెరిపి లేక
వినిపిస్తుంటాయి.
కాని -
సంగీతంలో
సరిగమలు
తెలియని నేను
ఆలపించిన
ఆనంద గీతం
నీ ఎదను తాకి
నీ ప్రేమను పొందింది.
మదిలోని బాధను
వెలికి పలికించిన
నా విషాద రాగం.
విశ్వమంతటా
విస్తరించి
నీ అనంత రాగాల
సంగీత తరంగాలలో
లీనమైన క్షణం,
దిగంతాల నుండి
దిగువకు దిగివచ్చి
అనురాగ కుసుమాన్ని
కానుకగా తెచ్చి
నిలుచుంటివి
మదీయ కుటీర
ద్వారము చెంత.

## 50.

## లుబ్ధుని దానం

పల్లె బాటపై
పలు గుడిసెల
ముంగిళ్ళలో
పొట్టకూటికై
చేయిచాపిన
దరిద్రవేళలో
పసిడి కలలా
కనుపించెను
కనుచూపు మేరలో
నీ రత్న ఖచిత
కాంతుల రథము.
అచ్చెరు వొందితిని -
ఎవరీ జగజగాల
రాజాధి రాజని ?

ఈ రాజురాకతో
నా నికృష్ట బ్రతుకు
మటుమాయమై
మంచి రోజులు
ఇక వచ్చాయనీ,
అడగకుండానే
దానం దొరుకుననీ
దుమ్ము ధూళిలో
అన్నివైపులా
అతను విరజిమ్మె

కాసుల రాసులకు
కొదవ వుండదనీ
ఎదురు చూస్తూ
నిలుచున్నాను.

రానే వచ్చెను
రథంబు నా చెంతకు -
ప్రసన్న వదనుడవై
క్రీగంట నను చూచి
క్రిందకు దిగి వచ్చిన
నీ శీవిని కాంచిన
మదీయ హృదయం
ఆశలు ఫలించే
అదృష్ట సమయం
రానే వచ్చిందని
భావించి భ్రమించింది.
కాని తటాలున
నీకుడి చేతిని
నా ముందుకు చాచి
కానుకివ్వమని
అర్థించావు నీవు.

ఆహా ! ఏమిటీ విచిత్ర
విపరీత పరిహాసము ?
రా రా జైన నీవు
బిచ్చమెత్తి బ్రతికే
నన్ను, బిచ్చగానిలా
అర్థించుటయా ?

తొట్రుపాటుతో
తడబడుతూ
జోలిలో నుంచి
అతి సూక్ష్మమైన
ధాన్యపు గింజను
తీసి ఇచ్చాను నీకు.

కాని సంజవేళ
భిక్షాటన ముగించి
నా జోలిని నేలపై
గ్రుమ్మరించగా
నేనార్జించిన
ధాన్య సంపదలో
మిల మిలా మెరిసే
అతి సూక్ష్మమైన
పసిడి గింజ
కనుపించగా
ఆశ్చర్య చకితుడనై
ఒక గింజ బదులు
ఉన్న ధాన్యమంతా
నీకు దానము చేయని
నా లుబ్ధత్వానికి
ఖేద మనస్కుడనై
వగచి విలపించితిని.

# 51.

## రాజాధి రాజు

రేయి చీకటి చిమ్మెను.
దిన చర్యలను ముగించి
ఆఖరి అతిథి కూడా
వచ్చితిడని భావించి
పల్లెలోని తలుపులను
బంధించిన వేళలో
'రాజు గారు వచ్చునని'
ఎవరో హెచ్చరించిరి.
అలా జరగదని నవ్వి
పరిహాసించితిమి మేము.

తలుపు తట్టి నట్లవ్వగా
గాలి తప్ప మరేమీ కాదని
ప్రమిదెలార్పి పవళించితిమి.
రాజ దూత వచ్చెనేమో
యని మాలోని కొందరనిరి.
'రాజదూత కానే కాదు –
గాలి చేసిన చప్పుడని'
గేలిచేసి నిదురించితిమి.

అర్థరాతిరి వేళ
వీనులకు వినిపించె
కర్ణకఠోర గర్జన.
అది దూరాన గర్జించిన
ఉఱుమేమో యని నిదుర

మైకములో తలంచితిమి.
ఆ గర్జన ఘోషకి
ధరిత్రి దద్దరిల్లి,
గోడలు గడ గడలాడి
నిద్రలో మము బాధింప
మాలో ఎవరో పలికిరి -
'ఆ భీకర గర్జన
రాజు రథ చక్రాలు
చేసే ప్రళయ ఘోషయని'.
'కాదు, కానే కాదు, అది
మేఘాల గర్జన' యని
నిదుర మత్తులో గొణిగి
తిరిగి నిదురించితిమి.

కటిక చీకటిలో
మ్రోగెను నగారా.
'లేవండి లేవండి
జాగు చేయవలదని'
పలికెను కంఠస్వరము.
చేతులు గుండెలదుమ
కంపించితిమి, భయముతో.
'అదుగో రాజ పతాకం'!
అని నుడివిరి కొందరు.
దిగ్భ్రమతో దిగ్గున
లేచి వెరచి అరిచితిమి -
'ఇక జాగు చేయుటకు
వ్యవధి లేదటంచు'
రానే వచ్చిరి రాజుగారు.
కాని, దీప హారతులెక్కడ ?

సుగంధ పూలమల లెక్కడ ?
ప్రభువు సింహాసనం బెక్కడ ?
సుసజ్జిత ప్రాసాద మెక్కడ ?
ఎంత తలవంపులు కలిగినవి.

ఎలుగెత్తి చాటిరి ఎవరో -
'ఎందులకీ వృధా ప్రయాస,
రిక్త హస్తాలతో స్వామికి
ఘనమైన స్వాగతం పలికి
శూన్యమైన మీ నివాసాలలో
అతిధ్య మివ్వండి ఆ రారాజుకి'

తెరవండి తలుపులు
ఊదండి శంఖాలు
నిబిడ చీకటిలో
మన శిథిల విషాద
నిశీథ రా రాజు
దయచేసెను దయతో.
భీకరంగా గర్జిస్తూంది
ఉఱుము నభోతలముపై.
మెఱుపుల తళుకులతో
కంపించి పోతూ వుంది
చీకటి భయాన్వితమై.
చినికి పీలికలైన
మీ హృదయచాపను
ప్రాంగణంలో పరచి,
భీకర తుఫానుతో
హఠాత్తుగా ఏతెంచిన
కాళరాత్రి రారాజును
ఆహ్వానించండి లోనికి.

# 52.

## నీ భీకర ఖడ్గము

నీ కంఠము నలంకరించిన
గులాబీ పువ్వుల హారమును
తప్పక యడుగుద మనుకొంటిని.
కానీ ధైర్యము చాలలేదు.
నువ్వు వెళ్లిన పిదప పక్కపై
దాలిన రేకులు పొందాలని
ఉదయము వరకు వేచి యుంటిని.
ఉషోదయంలో బికారివలె
ఒకటి రెండు పూరేకులకై
పాన్పు పై అంతా వెదికితిని.

హా! ఏమి కనుగొంటిని నేను.
నీ ప్రేమ చిహ్నంగా ఎట్టి
కానుక వొదిలి వెళ్లావు నీవు?
అది పువ్వు కాదు - పునుగు కాదు
పన్నీరు దాన్కానే కాదు.
అది ప ఇడుగు వోలె బరువైనది -
అగ్ని శిఖవోలె జ్వలించునది -
అదే నీ శక్తియుత ఖడ్గము!
తొలికాంతి, కిటికీలో నుంచి
జారి నీ పరుపు నాక్రమించె.
ఉదయ విహంగము కిలకిల మని
యడిగె - 'తరుణీ ఏమి దొరికెను?'
పువ్వు కాదది, పునుగూ కాదు -
పన్నీరు దాన్కానే కాదు.
అది నీ భీకర కరవాలము!
ఇదేమి కానుక యిచ్చితివని
చకితనై కూర్చొని తలచితిని -
'దీనిని దాచు స్థలమే లేదు.
అబల నగుట చేత సిగ్గుతో

ధరించ లేను ఈ ఖడ్గమును.
ఎదకదుముకొన్న గాయపర్చు.
అయినను నీ వింత కానుకను
బాధా భరిత గౌరవంగా
నా హృదయంలో భరిస్తాను'.

నేటి నుంచి నా ధరిత్రిలో
లేదు, నాకేభయయమూ -
నా సమరము లన్నింటి యందు
ఇక విజయ పతాకము నీదే.
నా సహచరునిగా మృత్యువును
ప్రసాదించి నిష్క్రమించితివి.
నా ప్రాణముతో ఆ మృత్యువు
నభిషిక్తుణ్ణి గావించెదను.
నా బంధములను నరికేందుకు
నీ ఖడ్గము నా చెంత వుంది.
ఇక నాకు ఈ లోకములో
ఎలాంటి భయమూ ఉండబోదు.

అల్పాలంకరణాలన్నీ
ఈనాటి నుంచి తీసివైతు,
నా హృదయేశ్వరా! ఇక నుంచి
నేను మూరు మూలల నీకై
నిరీక్షించి విలపించబోను.
నా వ్యక్తిగత ప్రవర్తనలో
ముగ్ధత్వ మధుర బిడియంబులు
ఇక పై మచ్చుకైన వుండవు.
నీ ఖడ్గమును భూషణముగా
ధరించుటకై నాకిచ్చితివి -
ఇక బొమ్మ ముస్తాబు లెందుకు?

# 53.

## నీ ఖడ్గ సౌందర్యము

లెక్కలేని రంగురంగుల మణులతో
విరాజిల్లుచు నక్షత్ర ఖచితమైన
నీదు కరకంకణము బహు రమణీయము.
కాని దాని కంటెను సుందరమైనది –
సాంధ్య కుపితారుణోగ్ర కెంజాయలో
విష్ణుని వాహనమైన గరుత్మంతుడు
విప్పిన రెక్కలు రచించిన వొంపుతో
మెఱుపులా కాంతులీనే నీ ఖడ్గము !

మృత్యువు యొక్క చివరి వేటులోని
బాధా భరితమైన పరవశమును
పొంది ప్రకంపించే ప్రాణంలా
కంపిస్తుంది నీదు ఖడ్గధార !
భీకర తేజస్సుతో భౌతిక వాసనలను
భస్మీకృతమొనర్చెడు పవిత్ర జ్వాలవలె
భాసిల్లుచు యుండును నీ ఖడ్గరాజము.

తారోచిత రత్న రంజిత మైన
నీ కంకణంబు బహురమణీయము.
కాని వజ్రపాణీ ! తలపులకూ
చూపులకూ అతిభయంకరమైన
నీ ఖడ్గసౌందర్యము అనన్యము !

## 54.

## మధుర స్మృతి

నిన్నెవరమూ నేనడగలేదు -
నా పేరైనా నీకు చెప్పలేదు.
నీవు వీడ్కోలు చెప్పినప్పుడు
మాటలురాక మూగనైతిని.
వేప చెట్టు వాలు నీడలో
పల్లెబావి పంచన
అన్యమస్కురాలనై
జాగు చేయుచున్న వేళ,
నా ప్రియ సఖులందరూ
నీరు నిండిన కుండలతో
ఇళ్ళకు తరలిపోతూ -
'తొలిప్రొద్దు తిరిగింది,
మలి ఎండ పెరిగింది.
సఖీ రారమ్ము మాతో'
అని ఆప్యాయంగా పిలిచినా
అవ్యక్త భావోద్వేగంలో
మునిగి మైమరచిన వేళలో
వారి పిలుపును పాటించక
నిర్వీర్యమై నిలిచిన నేను
అడుగుల సవ్వడైనా లేని
నీ రాక ఎరుంగ నైతిని.

నా పై వాలిన నీ కనులలో
ఖేదము చిందులాడగ -

'దప్పికతో తపిస్తూన్న
దీన బాటసారిని నేను'
అని పలికిన నీ మాటలలో
నీరసము తొణికిసలాడింది.
పగటి కలలు కంటూన్న
నేను తటాలున లేచి
దోసిలి పట్టిన నీ చేతిలో
దాహము తీరగ నీటిని పోసిన
దయాన్విత పుణ్య క్షణములో -
ఆకులు రెప రెపలాడాయి.
ఇరుల అదృశ్య మూలల నుంచి
కోయిల కమ్మగ కూసింది.
బాట మలుపున పెరిగిన
తోటలోని పొగడ పూవుల
సుగంధ పరిమళ సువాసన
గుప్పుమని గుబాళించింది.

సేద దీరిన నీవు
అనురాగముతో
అడిగితివి నా పేరు -
కాని సిగ్గు దొంతరలు
తెరలు తెరలుగా
క్రమ్మిన నా మది
మూగ వోగా ప్రతిమలా
నిలుచుంటిని నేను.
అయినా నీ స్మృతి పథంలో
పదిల పరిచేటంతటి
మహా ఘనకార్యంబేమి

ఆచరించితిని నేను ?
కాని నీ దప్పిక తీర్చిన
సుకృత శుభ కార్యము
నా సంస్మరణ గర్భంలో
చిరకాలం నిలిచి పోయి, నా
ఎదను ముంచెత్తును మధురిమలో.

ప్రొద్దు ముదిరింది.
పక్షుల కిలకిలలు
నీరసించినవి.
గాలి సోకిన వేపాకులు
గల గల మంటున్నాయి.
ఇచటనే చతికిలబడి
పదే పదే ఆలోచిస్తూ
వుండిపోయాను నేను.

# 55.

## నిద్ర మేలుకో

అలుపు ఇంకా నీ మదిని
అలుముకునే వుంది.
నీ కనులలో నిద్ర
ఇంకా నిలిచే వుంది.

ముళ్ళు మొలిచిన
రెమ్మల శయ్యలో
రేకులు విచ్చిన
కుసుమం రాజ్ఞిగా
రాజిల్లుతూ వుందని
నీవు వినలేదా ?
మేలుకో, నిద్ర మేలుకో
కాలం వృధా చేయకు !
కణకు రాళ్ళ
కఠిన బాట
కరిగి విలసిల్లిన
ప్రశాంత దేశపు
బీడు భూమిలో
ఏకాంతంగా
నిరీక్షిస్తున్నాడు
నా ప్రియ మిత్రుడు.
అతనిని మోసము చేయకుము.
మేలుకో, నిద్ర మేలుకో !
మధ్యాహ్నపు వేడిలో
ఆకసం రగిలి వణికి
రొప్పితే రొప్పనీ -
దహించే ఇసుక
దాహపు వలువను
పరిస్తే పరవనీ -

నీ ఎద వాకిటిలో
నవ్వుల పువ్వులు
విరియనే లేదా ?
రహదారి తుంబుర
నీ అడుగు పడిన
ప్రతి పదా ఘాతంతో
మ్రోగించలేదా
మూగ మూల్గుల
మధుర రాగాలను ?

# 56.

## నా ప్రేమే నీ ఆనందము

నేనంటే నీకెంతో
ఆనందానురాగములు
అందుకే దిగి వచ్చితివి
నా సమ్ముఖంబు చెంతకు
సర్వలోకాధీశ్వరా !
నేను లేక పోయినచో
నీ ప్రేమ ఎచటుండునో ?

ఈ సకలైశ్వర్యానికి
భాగస్వామిగ చేసితివి.
నీ హర్షానుభూతులే
నా ఎదలో నిరంతరం
తాండ విస్తున్నాయి.
నీ చిత్తమే నిత్యమూ
నా జీవిత రంగంలో
రూపు దిద్దు కుంటున్నది.

ఇందుకు, రారాజువైన
నీవు నా హృదయాబ్జమును
వశపరచుకొనవలయునని
ఎంతో సౌందర్యంగా
అలంకరించుకున్నావు.
ఇందుకొరకే నీ ప్రేమ,
సఖినైన నా ప్రేమలో
లీనమైన తరుణంలో,
కనిపించును నీ రూపము
మన పూర్ణ సంగమంలో

# 57.

## జ్యోతి

వెలుగు, నా మదిలోని వెలుగు
[illegible]మంతా నిండే వెలుగు
[illegible] చుంబించే వెలుగు
[illegible]ం చేసే వెలుగు

[illegible]
[illegible] వెలుగు.
[illegible] చంద్రులను
[illegible] వెలుగు,
[illegible]!
నభము కనులు విప్పెను.
గాలి అదుపు తప్పెను.
హాస భాసురమయ్యె
పృథ్వీతలమంతయు.

కాంతి సాగరం మీద
సీతాకోక చిలుకలు
రెక్కల తెరచాపలను
విప్పి ఎగురుచున్నాయి.
కలువలూ, మల్లియలూ
వెలుగు అలల శిఖలపై
పెల్లుబికి వికసించెను.

మబ్బుపై, మొగులుపై
పడిన వెలుగు రేఖలు
బంగారు ముక్కలై
రత్నాల కాంతులను
విరివిగా విరజిమ్మె.

నా ప్రియా ! ఆకు నుంచి
ఆకునకు ఆహ్లాదం
విస్తరిల్లుతూ వుంది.
అంతులేని ప్రసన్నత
అంతా అలుముకున్నది.
ఆకాశ గంగ ఉబికి
ముంచె తన తీరములను.
ఆనందం వరదలై
పారెను దిక్కులంతయు.

## ౫౮.

# సంతోష స్వరాల సమైక్యత

ధరిత్రి ఎదపై మొలిచిన
పచ్చని పసరిక విశృంఖల
విజృంభణలో దాగిన
భూదేవి ఆహ్లాదం -
చావు బ్రతుకులనే
అనుంగు కవలలు
ధరణి పై సలిపే
విలయ నృత్యాన్ని
పురిగొల్పే ఆహ్లాదం -
ప్రళయ భీకర
ఝుం ఝూ నిలముతో
ప్రాణ కోటిని
ఊపిలేపి
నవ్వుల జడిలో
ఉక్కిరి బిక్కిరి
చేసే ఆహ్లాదం -
క్లేశ కలువ
కెంపు రేఖలపై
జాలువారే
కన్నీటితో, కదలక
మెదలక నిశ్చలంగా
నిలిచే, ఆహ్లాదం -
తన సర్వస్వాన్నీ
దుమ్ములో దిమ్మరించి
ఒక పలుకైన పలుకని
ప్రశాంత ఆహ్లాదం -
ఆహ్లాద స్వరాలన్నీ
నా అంతిమ గీతంలో
కలిసి కరిగిపోనీ !

# 59.

## నా హృదయేశ్వరా

ఓ, నా హృదయేశ్వరా !
ఇది నా ప్రేమ తప్ప
మరేమీ కాదని
నాకు తెలుసునులే.

[illegible]పై నాట్యమాడే
[illegible] పసిడి కాంతులు -
[illegible]ం వీధిలో
[illegible]సరిగా తిరిగే
[illegible]గగనమున
[illegible]ల గుంపులు -
నా నుదుట తన
చల్లని స్పర్శతో
హాయిని గొలిపే
ఈ శీతల గాడ్పులు -
నీ ప్రేమ చిహ్నాలే
అని నాకు తెలుసునులే.

ప్రభాత కాంతులు
తమ జిలిబిలి వెలుగును
మూసిన నా కనులపై
గ్రుమ్మరించినవి.
నా మదిని స్పందించిన
నీ సందేశ మిదేనని
తెలుసుకుంటిని నేను.
దివి నుంచి భువి పైకి
నీ శిరస్సును వొంచి,
నీ కనులు నా కనులను
పలకరించిన వేళ
ఈ నా హృదయము
నీ పాదములను
తాకి తరించును.

# 60.

## పిల్లల సమావేశము

అంతులేని లోకాల
కడలి తీరమందు
చెలిమితో చేరారు
చిన్నారి పాపలు.
అబ్బురముగ అంబరము
నిశ్చలముగ నిలిచె.
జలధి లోని జలము
పొంగి పొంగి పొరలె.
అంతులేని లోకాల
కడలి తీరమందు
చిలిపి కేకలతో
చిందులు తొక్కుతూ
కలయంగ వచ్చారు
చిన్నారు పాపలు.

ఇసుక మేటలతో
ఇళ్ళు కడతారు.
ఆలిచిప్పలతో
ఆడుకుంటారు.
ఎండుటాకులతో
పడవలు నేస్తారు.
నేచిన పడవలు
జలధి తరంగాలపై
పయనిస్తూ వుంటే
మధుర హాసంలో
పరవశిస్తారు.

సమస్త జగాల
సముద్ర తీరమందు
ఆటలాడెదరు
చిన్నారు పాపలు.

నీటి పై ఈదుట
తెలియదు వారికి.
జాలర్లలా వలలు
వేయలేరు వారు.
ఆణి ముత్యములకై
జలధి లోతులు
తరచి వెదుకుతారు
ముత్తెపు జాలరులు -
లాభాలకై ఓడలపై
తిరుగుతారు విపణులు.
రంగు రంగుల గుళకరాళ్లు
పోగు చేసి పారవేస్తారు
ఈ చిన్నారి చిఱుతలు.
గుప్త నిధులకై
వారు శోధించరు.
వలలు వేయుట
వారెరుంగరు.

కడలి ఉరము నవ్వుతో
ఉప్పొంగి ఉబికింది.
తీరపు చిరునవ్వు
నురుగై తెల్లగ మెరిసింది.
మృత్యు తరంగాలు
ఊయల ఊపుతూ
జోల పాడే తల్లి
అర్థం పర్థం లేని

మాటల పాటలను
పాడి వినిపిస్తున్నాయి
ఆ చిన్నారి పాపలకి.
అంబుధి ఆడును
ఆ చిన్నారి చిరుతలతో -
తీరపు చిరునవ్వు
నురుగై మెరియును తెల్లగ.

అంతులేని లోకాల
కడలి తీరమందు
చెలిమితో చేరారు
చిన్నారి పాపలు.
దారిలేని మిన్నుపై
సంచరిస్తూ వుంది
ధ్యేయం లేని తుపాను.
బాటలు లేని
నీరధి నీటిపై
భగ్న మవుతన్నాయి
ఓడల జాడలు.
మృత్యు దేవత
నలుమూలలా
స్వైర విహారం
చేస్తూ వుంది.
అయినా ఆడుతున్నారు,
చిన్నారి చిఱుతలు.
అంతులేని లోకాల
కడలి తీరమందు
జరుగుతూ వుంది
చిన్నారి పాపల
మహోన్నత మైత్రీ సభ.

## 61.

## శిశు లీలలు

పసిపాప కనులపై పారాడే నిద్ర
ఎటునుండి వచ్చెనో ఎవరికైన తెలుసా ?
మిణుగురుల మసక వెలుగుల అడవి నీడల
అప్సరల పల్లెలో రెండు మంత్ర మోహన
మేలి మొగ్గలు వ్రేలాడుతూ వున్నవట.
ఆ మొగ్గల నుండి యీ నిద్ర చల్లంగ
పాపాయి కనులను ముద్దాడ వచ్చెనని
ఒక విచిత్ర వదంతిని విన్నాను నేను.

నిద్రించే శిశువు పెదిమిలపై మెరిసే
నవ్వెచట పుట్టెనో ఎవరికైన తెలుసా ?
మాయమయ్యే శరత్ మేఘాంచలంబును
శుక్ల పక్ష చంద్రుని ధవళ కిరణ మొకటి
తాకన్, అందుండి పుట్టెనట ఆ నవ్వు.
ఆ తుషార స్నాత ప్రభాత స్వప్నంలో
ఈ నవ్వుకి ప్రథమ జననంబని వదంతి -
అదే శిశువు పెదిమలపై మెరిసే నవ్వు.

శిశువు అంగాంగముల మెరిసే నిగనిగలు
ఎటుదాచ బడినవో ఎవరికైన తెలుసా ?
శిశువు మేనుపైన మెరిసే మధుర స్నిగ్ధ
కోమలత్వము, బాల్యమందున శిశు మాత
హృదిలో రహస్యంబుగా విస్తరించిన
నీరవ ప్రేమ నీడలే, ఆ నిగ నిగలు.
అవే మృదు మధుర నూతన నిగనిగలుగా
శిశువు అంగాంగములపై మెరియుచున్నవి.

## 62.

## నిజము తెలుసుకున్నాను

నేను నీకు పలు రంగుల బొమ్మలు తెచ్చి
ఇచ్చి నపుడే, పాపా, నిజము తెలిసె నాకు -
మేఘాలపైన, నీటి పైన, ఇన్నిన్ని
రంగులెందుచేత నాట్యమాడుతాయో -
ఎన్నెన్నో వన్నెలతో పువ్వులెందుకు
పూయబడినవో, నీకు రంగుల బొమ్మలు
ఇచ్చినపుడె, పాపా, నిజము తెలిసె నాకు !

నీచే నాట్యము చేయించుటకై నేను
పాటపాడినపుడే తెలిసె నిజము నాకు -
ఆకులలో సంగీత మెందుకున్నదో,
చెవియొగ్గి వినే భూమాత హృదయానికి
అలలు తమ ఘోషలెందుకు వినిపించునో -
నీచే నాట్యము చేయించుటకై నేను
పాట పాడినపుడే తెలిసె నిజము నాకు !

ఆశతో చాచిన నీ చేతులకి నేను
మధుర భక్ష్యాలను ఇచ్చినప్పుడె, తెలిసె -
పుష్పపాత్రలో తేనె ఎటుల చిప్పిలునో,
ఫలములందెటుల మధుర రసం నిండునో -
ఆశతో చాచిన నీ చేతులకి నేను
మధుర భక్ష్యాలను ఇచ్చినప్పుడె తెలిసె !

నిను నవ్వించుటకు మోము ముద్దిడినపుడు
ఉషోదయ కాంతిలో ఆకాశము నుంచి
దొర్లి ప్రవహించే ఆనందమేమిటో,
గ్రీష్మ పవనము నాకిచ్చే సుఖమేమిటో
నిశ్చయముగ కనుగొంటిని నిజమును, నేను
నిను నవ్వించుటకు మోము ముద్దిడినపుడు.

నేనెరుగని నేస్తాలకు
నను పరిచయంచేసి
పరాయి పంచలో
చోటు కల్పించావు నాకు,
అందని అందలాన్ని
దగ్గరగా చేర్చి
అపరిచితుణ్ణి సైతం
సోదరునిగా చేశావు.

అలవాటైన ఆశ్రయాన్ని
వదలి వెళ్ళాలంటే
ఎద ఆందోళనతో
అలమటిస్తుంది.
స్థలం క్రొత్తదైనా
అక్కడ కూడా
క్రొత్తలో పాత
ఇమిడి వుంటుందనీ,
నీవు తోడుగా వుంటావనీ
మరిచిపోయాను నేను.

జనన మరణాలలో
ఇహ పరలోకాలలో
ఎచటెచటకు నీవు నన్ను
నడిపించినా, నా ఆత్మ
జరిపే దీర్ఘ యాత్రలో

# 63.

## ఏకైక నేస్తమా !

నీడలా నన్ను వీడక
అన్యుల గుండెలు సైత
నా ఎదతో ముడివేసే
నా ఏకైక నేస్తమని
నాకు తెలుసునులే ప్రభ

నిన్నెరిగిన వాడికి
అన్యులంటూ లేరు
ఎల్లప్పుడూ అతనికై
అన్ని తలుపులూ
తెరిచి వుంటాయి.
అనంత హస్తంబుల
విన్యాసంలో నీ
హస్త స్పర్శ ఇచ్చే
కైవల్యానుభూతి
కోలుపోకూడదని
కోరే నా ప్రార్థన
మన్నించుము స్వామీ !

## 64.

## దివ్వె

నిర్మానుష్యంబైన
ఏరు ఏటువాలులో
ఎత్తైన దుబ్బులలో
అర్థించాను ఆమెను -
'ఓ, పరువాల బాలా !
ప్రమిదలోని దీపాన్ని
నీ చేలాంచలముతో
కాపాడి రక్షిస్తూ
ఎచటకు పోవుచుంటివి ?
నా ఇంట వెలుగు లేదు.
నా వెంట తోడు లేదు.
నీ ప్రమిదను నాకిచ్చి
నా ఇంట వెలుగు నింపు -
కురుల కాంతులు ఒలికే
కన్నులను తృటికాలం
చీకట్లు చీలుస్తూ
నా మోముపైన నిలిపి
మృదువుగా వచియించెను -
'పగలు పడమటి అంచున
కృంగగా నా ప్రమిదను
ఏటిలో వొదులుటకై
వచ్చాను నది ఒడ్డుకు'.
ఎత్తయిన పొదల మధ్య
నేనొంటరిగా నిలిచి
ఆమె ప్రమిదలోని శిఖ

వెరుకుగా వ్యర్థంగా
నీటిపై పోతూంటే
చూస్తూ ఉండి పోయా.

ఇలను క్రమ్ముతూ వున్న
నిశీధి నిశబ్దంలో
అర్థించాను ఆమెను -
'ఓ, పరువాల బాలా!
నీ దీపంబులన్నీ
వెలిగించబడినాయి.
ఈ దీపమునుగైకొని
ఎచటకు పోవుచుంటివి ?
నా ఇంట వెలుగు లేదు
నా వెంట తోడు లేదు.
నీ ప్రమిదను నాకిచ్చి
నా ఇంట వెలుగు నింపు.
సంశయం దాగి వున్న
కనులతో క్షణకాలం
ఓరగ నను వీక్షించి
కోయిల కంఠంబుతో
వచియించె, కన్య ఇటుల -
'నా దీపాన్ని నింగికి
కానుకగా అంకితం
చేయాలని వచ్చాను.'
ఆమె ప్రమిదలోని శిఖ
శూన్యంలో వృథాగా
కాంతులు చిమ్ముతుంటే
చూస్తూ ఉండిపోయా!

పున్నమి చంద్రుడు లేని
అర్ధరాత్రి చీకటిలో
అర్థించాను ఆమెను -
'పరువాల బాలా !
నీ గుండెకు దగ్గరగ
దీపంబును హత్తుకొని
దేనికై అన్వేషణ
సాగిస్తూ వున్నావు ?
నా ఇంట వెలుగు లేదు.
నా వెంట తోడు లేదు.
నీ ప్రమిదను నాకిచ్చి
నా ఇంట వెలుగు నింపు'.
ఒక క్షణమాలోచించి
చీకటి తెరలను చీల్చి
కన్నార్పక ననుచూచి
కమనీయ కంఠముతో
జవాబిచ్చె ఆ కన్య -
'దీపాలు జరుపుకొనే
దీపావళి జాతరలో
నా దివ్వె వెలగాలని
వచ్చితి నా దివ్వెతో'.
ఆమె చిన్నారి దివ్వె
శతకోటి దివ్వెలలో
వ్యర్థంగా లీనమ్మై
కంటికి దూరమవ్వగ
చూస్తూ ఉండిపోయా !

# 65.

## దివ్యామృతము

ప్రభూ ! పెల్లుబికే నా జీవిత పాత్ర నుండి
ఏ దివ్యామృతంబును చవి చూడ తలిచావు ?

నా కవీ ! నీ సృష్టిని నా కళ్ళతో చూచి
నిశ్శబ్దంగా నా కర్ణ ద్వారాల వద్ద
నిలబడి నీ అనంత స్వర సామరస్యంబును
వీనుల పండుగ వినడము నీ కానందమా ?

నీ సృష్టి నా ఎదలో మాటల్ని అల్లుతోంది.
నీ మోదం వాటికి సంగీతాన్నిస్తాంది.
నిన్ను నీవు ప్రేమతో నాకు అర్పించుకుని
నీ మాధుర్యమంతా నాలో చవి చూస్తావు.

# 66.

## ఆమె.

ఈ షత్కాంతిలో
అస్పష్టంబుగా
నాకు గోచరించి
నా అణు వణువులో
సదా స్పందించిన
ఆ కోమలాంగిని -
ప్రత్యూష వెలుగులో
ముఖముపై మూసిన
ముసుగు తెర వీడని
ఆ పసిడి కన్యను
నా తుది పాటలో
లెస్సగ వర్ణించి
నా కడపటి కాన్కగ
నీకిచ్చెద ప్రభూ !

ముగ్ధ మృదు పదముల
ముద్దు గారడీకి
లొంగలేదు ఆమె.
విన్నపము చాచిన
కాంక్షా కరములకు
చిక్కలేదు ఆమె.

ఆమెను ఎదలో
స్థాపించి నేను
దేశదేశాలు
పర్యటించాను.

ఆమె చుట్టూర
పెరిగి నశించెను
నా జీవిత గృహ
శిఖర శిథిలాలు.
నా తలంపులలో
నా కార్యములలో
నా నిద్రల యందు
రాత్రి కలల యందు
రాజ్ఞిగ రాజిల్లి
నిజ జీవితములో
నాకు దూరముగా
బ్రతికె ఒంటరిగా.

ఎందరెందరో
ఆమె కోసమని
నా తలుపు తట్టి
అతి నిరాశతో
నిష్క్రమించారు.

ఈ ప్రపంచములో
ఆమెను ఎవ్వరూ
ముఖా ముఖిగ చూడ
నైన చూడలేదు.
నీ కటాక్ష భిక్ష
కై పరితపిస్తూ
ఆమె ఒంటరిగా
వేచి వుంది, ప్రభూ!

## 67.

## తేజోమయ రోదసి

అంతులేని నింగివి నీవో
గుప్పెడంత గూడువు నీవే

ఓ సౌందర్య మూర్తీ !
ఆ గువ్వంత గూడిలో
ఆకసమంత ఆత్మని
నీ ప్రేమ పాశంతో
బంధించి చెరబట్టి
సొంపైన రంగులతో
ఇంపైన ధ్వనులతో
మత్తైన పరిమళంలో
ముంచి మురిపిస్తున్నావు.
తన కుడిచేతి యందలి
పసిడి పూల సజ్జలో
ప్రకృతి సౌందర్యంబును
పూల మాలగా మలిచి
భూదేవి శిరస్సుపై
సౌరభ కిరీటంగా
అలంకరించ వలెనని
అరుదెంచుతూ వున్నది.
అందాల ఉదయ కాంత.

పశ్చిమ నీరధి నుంచి
సువర్ణ కలశంబులో,
శీతల శాంతి జలమును
సమృద్ధిగా నింపుకుని
పశువులు వదిలిన శూన్య
పచ్చిక బయళ్ళ యందు
బాటలు లేని దారుల
వెంట పయనమైవచ్చు
చున్నది సంధ్యారాణి.

ఎక్కడైతే ఆకాశము
కల్మము లేని ఆత్మ యొక్క
నిరంతర పరిభ్రమణమై,
అనంత వ్యాప్తి చెందినదో,
అచట ఉజ్వల ధవళ కాంతి
రాజ్ఞిగ రాజ్యమేలుతూంది.
అక్కడ -
రేయిలేదు, పగలు లేదు
రూపు లేదు, రంగు లేదు
ఉలుకు లేదు, పలుకు లేదు
అసలు లేదు పదమైనను !

## 68.

## మేఘోత్తరీయము

కబళించే
కరములతో
నీ కాంతి రేఖ
నా ఖగోళం పై
కాలు మోపి
నా కన్నీళ్లతో
నిట్టూర్పులతో
వెతలపాటలతో
ఆవిర్భవించిన
కాఱు మబ్బులను
నీ పద ద్వయము
చెంత చేర్చుటకై
నా ద్వారము
దరి దాపున
దినమంతా
వేచి వుండును.

మితి లేని
ముదముతో
ఆ మంచు
మేఘానికి
లెక్కలేని
రూపాలను
సంతరించి
వింత వింత
మడతలలో
ముడిచి మలచి
అనుక్షణం
మారే రంగుల
పూతలు పూచి
తారలు మెరిసే
నీ విశాల రొమ్ముపై
ఉత్తరీయంగా
కప్పుకుంటావు.

మచ్చలేని ప్రశాంత
పవిత్ర ప్రభూ !
మబ్బుల నుంచి
మలచబడిన
ఆ అందాల
ఉత్తరీయము
దూదిలా తేలికై
గాలిలా అగోచరమై
అతి సున్నితమై
అశ్రు భరితమై
కటిక నలుపై
దోచెను నీ మదిని.
అందుకే ఆ శ్యామ
మేఘోత్తరీయము
తన విషాద నీడలతో
నీ ధవళ ఉజ్వల
కిరణ కాంతులను
క్రమ్మి కప్పుచున్నది.

# 69.

## ప్రాణ ధార

రాత్రింబవళ్ళు నారక్త నాళాల్లో
ప్రవహించే ప్రాణ ధారే విశ్వమందు
పారి లయబద్ధముగ నృత్యము చేస్తోంది.

ఆ జీవ శక్తే భూ ధూళిలో నుంచి
అసంఖ్యాక ములైన గరిక పరకలుగా
ధరిత్రి పై మొలక లెత్తి ప్రసూన పత్ర
కల్లోల వీచికలుగా విరుచుకుపడును.

చావు పుట్టుకలనే కడలి ఊయల పై
అలల ఆటు పోటులుగా విజృంభించి
పొంగి పొరలేది ఆ జీవ శక్తియే.

ఆ జీవ శక్తి స్పర్శవల్లే ఉజ్వల
భరితమయ్యె నా శరీర అంగాంగములు.
యుగ యుగాలు స్పందించిన ఆ జీవ శక్తి
నా రక్తంలో ఈ క్షణం నాట్యమాడి
ఉద్భవింప చేస్తూంది నా రాజసాన్ని.

# 70.

## ఆనంద తెరటం

ఈ మనోజ్ఞ సంగీత లయకు
హర్షించని హృదయమా నీది ?
ఈ భీషణానందోద్రేక
సుడి చక్ర పరిభ్రమణంలో
విసరబడి విరిగి వినీలమై
పరవశించని మనసా నీది ?

చరాచరములన్నీ ఆగక
తిరిగి చూడక సాగుచున్నవి.
ఏ శక్తి వాటి నాపలేవు.
అవి అలా సాగుచూ యుండును.

విరామం లేని శీఘ్రగమన
సంగీతంలో అడుగేస్తూ
అవతరించి ప్రకృతి ఋతువులు
నర్తిస్తూ అంతమయ్యాయి.

ఏ ఆనందము పొంగి పొరలి
చిన్నాభిన్నమై క్షణక్షణం
విరిగి నశిస్తూ వుంటుందో
ఆ హర్షంలోకి రాగాలు,
రంగులు, సుగంధాలు, అనంత
జలపాతంలా కురుస్తాయి.

# 71.

## దైవలీల

నన్ను నేను మహనీయునిగా
నలుదెసల చాటించుకుంటూ
నీ తేజస్సు పైన పలు రంగు
నీడలు పడేటట్లు, ఎందుకు
మాయచేస్తున్నావు స్వామీ !

నిన్ను నువ్వే విభజించుకుని
నీ ఖండితాత్మని శతకోటి
నామముతో పిలుచుకుంటావు.
వేరైన నీ ఆత్మ పొందెను
రూపమున్ నా శరీర మందు.

రంగు రంగుల అశ్రువులుగా
పెదాలపై చిరునవ్వులుగా
పలు భయాలుగ, పెను ఆశలుగ
ఆకసములో విషాద గీత
రవళి ప్రతి ధ్వనించుచున్నది.
కెరటాలు పొంగి విరుగుతాయి.
కలలు ఉదయించి కరుగుతాయి.
నా అజ్ఞానాంధకారములో
కనిపించును నీ పరాజయం.

నువు సృష్టించిన ఈ తెరపై
అసంఖ్యాకమైన చిత్రాలు
దివారాత్రులనే కుంచెతో
చిత్రీకరించుట జరిగెను.
సారంలేని సరళరేఖలు
త్యజించి, ఆశ్చర్యమును గొల్పు
నట్లు వృత్తరేఖలు గీసిన
నీదు అద్భుత సింహాసనము
తెర వెనుక అల్లబడి వున్నది.

నీవూ నేనూ జరిపిన ఈ
మహోత్సవంబు నింగినంటా
బహురమ్యముగా అలుముకొంది.
నీవు నేనూ మేళవించిన
శృతులతో గాలి స్పందిస్తూంది.
నీవు నేను ఆడుకుంటున్న
ఈ దాగుడు మూతలతో యుగ
యుగాలు గడిచి పోతున్నాయి.

# 72.

## సర్వాంతర్యామి

తన నిగూఢ స్పర్శలతో
నాలోని చైతన్యాన్ని
నిరంతరం మేల్కొలిపే
అంతరాంతరముల వ్యక్తి
ఆ సర్వాంతర్యామే.

ఈ నా కనులపై తన
సమ్మోహనా శక్తిని
ప్రసరించునట్లు చేసి
నా హృదయ తంత్రుల పై
హర్షక్లేశ రాగములు
ప్రత్యేక స్వరాలతో
మీటేది ఆ ప్రభువే.

ఈ లోకం చుట్టూ
క్షణం క్షణం మారే
పసిడి, రజత, వన్నెల
హరిత, నీలి కాంతుల
మాయా జాలంబును
నేసేదీ అతనే.
ఏ పాద స్పర్శకే
తన్మయుడ నౌతానో
ఆ పదముల మడతల
మధ్య నుంచి రంగుల
కాంతులు చిమ్మేదీ
ఆ పరమేశ్వరుడే !

కదిలే కాలంబుతో
పరుగెత్తును యుగంబులు
హర్షంబు పెల్లుబికిన
ఆహ్లాద సమయములో
దుఃఖం క్రుంగదీసిన
నీరస సమయాలలో
ఎన్నెన్నో పేర్లతో
సహస్ర రూపాలతో
నా ఎదను పలకరించి
ఓదార్చేది అతనే.

# 73.

## జీవన్ముక్తి

వైరాగ్యంలో
పొందలేను
మోక్షం నేను.
వేయి మధుర
బంధాలలో
కలదు కమ్మటి
స్వాతంత్ర్యపు
కౌగిలింత,

పలు వన్నెలతో
పరిమళాలతో
భాసిల్లు స్వచ్ఛ
మధుర మద్యమును
నిత్యమూ పోసి
ఈ మట్టి పాత్ర
నింపుతున్నావు
అంచుల వరకూ,
తన శత భిన్న
దీపాలను
నీ జ్వాలతో
నా ప్రపంచం
వెలిగించుకొని
నీ గుడిలోని
వేదికపైన
హారతి ఇచ్చు.

మూయ నెన్నడూ
నా పంచేంద్రియ
కవాటంబులను.
నా దృశ్య శ్రవణ
స్పర్శ సుఖములలో
చవిచూతును నేను
నీ ఆహ్లాదమును.

నాలోని భ్రమలన్నీ
రగిలి వెలుగుతాయి
ఆనంద జ్యోతులుగ
నా వాంఛలన్నీ
పరిపక్వంబు పొందు
ప్రేమ ఫలములుగా.

# 74.

## సంజ ఊహాలు

దినము గతించెను.
పెరిగెను ఇలపై
చీకటి నీడలు.
నదీ తీరమున
నీటి కుండలో
నీరు నింపుటకు
వేళా యెనురా.

సంధ్యా గాలిలో
ప్రతి ధ్వనించెను
సెలయేటి నీటి
కన్నీటి పాట.
చిఱు సంధ్యలోకి
కదలి రమ్మనుచు
పిలిచె నది నన్ను.
నిర్జన దారిలో
పాంథుడే లేడు.
రేగిన గాలిలో
రెచ్చిపోయినవి
నదిలోని సుడులు.

ఇంటికి తిరిగి
రాగలనో
రాలేనో
ఎఱుగను నేను.
ఎవరెవరిని
అనుకోకుండా
కలియుదునో
ఎఱుగను నేను.
లోతు లేని
ఏటి నీటిలో
చిన్న పడవలో
ఓ అపరిచితుడు
పిల్లన గ్రోవి పై
పలికిస్తున్నాడు
శ్రావ్య రాగాలను.

# 75.

## అంతిమ లక్ష్యం

మర్త్యులమైన మాకు
నీవిచ్చిన వరాలు
మా అవసరములెల్ల
తీర్చి నీ వద్దకే
తిరిగి తిరిగి తరగక
పరుగులిడును స్వామీ !

పొలాలలో నుంచి
పల్లెల మధ్యగా
రోజూ పారుచూ
నీటి నందించే
ఏటి తెరపి లేని
ప్రవాహ ధ్యేయం
నీ చరణంబులను
కడిగి తరించుటకే.

తన పరిమళాలతో
గాలిలో మధురిమలు
కురిపించిన పుష్పం
కడసారి సేవగా
నీ పాదముల చెంత
రాలిపోవాలనే
తపిస్తుంది స్వామీ !

నిన్ను పూజించుట వల్ల
తరగదు సిరి ఈ ఇలలో,

కవి కూర్చిన పదాల నుంచి
తీసుకుంటారు మనుష్యులు.
తమకి నచ్చిన అర్థాలను.
కాని వాటి తుది అర్థాలు
నిన్నే సూచించును ప్రభూ

## 76.

## నీ ప్రమోల నిలవనా !

నా జీవితేశ్వరా !
దిన దినము, ప్రతి దినము
నీ ప్రమోల నిలవనా ?
అఖిల లోకేశ్వరా !
నా అంజలి ఘటించి
నీ ప్రమోల నిలవనా !

నీ విశాల నింగి క్రింద
ఒంటరిగా మౌనంగా
నమ్రతా నిబిడ హృదితో
నీ కట్టెదుట నిలవనా !

బ్రతుకుల కొలువుల
ఘర్షణ ఘోషలు
నిండిన నిష్ఠుర
కర్కష ఇలలో
ఉరకలు పరుగులు
పెట్టే జనాల
మధ్య నీ ప్రమోల
నేను నిలవనా !

తుదకీ లోకంలో
నా విధిని నెరవేర్చి
రాజరాజేశ్వరా !
ఒంటరిగ మౌనముగ
నీప్రమోల నిలవనా !

# 77.

## నా దురదృష్టము

నీవే నా దైవమని ఎరిగి
నీకు దూరంబుగా నుంటిని.
నీవు నా వాడివని తెలియక
నేను నీచెంతకు రానైతి.
నీవు నా తండ్రివని ఎఱింగి
చేసితి పాదాభివందనము.
నేస్తముగ నెంచి గాఢముగా
కరచాలనము చేయనైతిని.

నీవు దివి నుంచి భువికి వచ్చి
'నేను నీ వాడినేనని' నా
కెరింగించినా, నిన్ను ఎదకు
హత్తుకుని, నా స్నేహితునిగా
నమ్మి నీకడ నిలువనైతిని.

నా సోదరులలో సోదరుడివి,
కాని, వారిని లక్ష్య పెట్టక
నా సంపదను వారెవ్వరితో
పంచుకొనని నేను, వారిలో
ఒకడివైన నీతో సమస్త
సిరి పంచుకో నైతిని ప్రభూ !

సుఖ దుఃఖాలలో మానవులకు
తోడు నీడగ నిలవని నేను
నీ పంచ ఎలా నిలబడగలను !
నా జీవితాన్ని త్యజించుటకు
జంకే నేను, జీవన నదిలో
దుముకలేక నిలిచి పోయాను.

# 78.

## అన్వేషణము

సృష్టి నవోదయాన తారలు
తొలి తేజస్సుతో శోభించ
దేవతలు సమావేశంబై
'పరిపూర్ణతకిది ప్రతిబింబం -
నిర్మలానంద కేంద్రంబిది,'
అని ముక్త కంఠముతో పాడిరి.

అప్పుడరిచె నొకడు హఠాత్తుగ -
'కాంతి హారం తెగినట్లుంది
ఒక తార రాలినట్లున్నది'.

దేవతా వీణ స్వర్ణ తీగ
ఫెళ్ళు మని తెగి పాట ఆగెను.
'రాలిన తార - అపూర్వమైన
నభోలోకశోభైక తార'
యనుచు దేవతలు శోకించిరి.

ఆనాటి నుండి నేటి వరకు
ఆ తారకై అంతే లేని
అన్వేషణము సాగుచున్నది.
'ఈ నక్షత్రమును గోల్పోయి
ఇల గోల్పోయె పెను సంబరము'
అని అరిచె ఒకరి వెంట నొకరు.

నిబిడ నీరవ నిశిలో తారలు
చిరునవ్వు చిందులొలికిస్తూ
'ఈ అన్వేషణము వృథా శ్రమ -
ఛేదింపబడని పరిపూర్ణత
ప్రకృతంతా విలసిల్లుతోంది.'
అని గుసగుస లాడుకున్నాయి.

# 79.

## విషాద ఛాయలు

ఈ జీవితంలో నిన్ను కలిసే భాగ్యం
నాకు లేకపోతే
నీ దర్శనాన్ని పొంద లేక పోయానే
అనే వ్యధ ఉండనీ !
ఒక నిముషమైన బాధని మరువ నీయకుము.
ఈ విషాద బాధా
ఛాయలను చైతన్య స్వప్నావస్థలలో
నన్ను భరించనిమ్ము.
క్రిక్కిరిసిన ఈ జగతి సంతలో రోజులు
గడిచి పోతున్నాయి.
ఈనాదోసిల్ళు దైనిక, లాభాలతో
నిండుతున్న కొద్దీ
నేను విలువైన దేమియును పొందలేదని
నను మరువ నీయకుము -
ఈ దుఃఖార్తి, చైతన్య స్వప్న స్థితులందు
నన్ను భరించనిమ్ము.
వీధి ధూళిలో అలసి రొప్పుచూ కూచుని
పక్క పరిచిన వేళ
పయన మింకను చాలా దూరము కలదనుచు
నను మరువనీయకుము -
ఈ శోకమును చైతన్య స్వప్న స్థితులందు
నన్ను భరించనిమ్ము.
అలంకరించబడిన నా గదులలో మురళి
రవళులు మ్రోగు వేళ
నవ్వుల కేరింతలు ప్రతిధ్వనించునపుడు
సైతమున్, నిన్ను నా
ఇంటికి ఆహ్వానించనైతిననే ధ్యాస
నను బాధించనిమ్ము.
ఒక నిమిషమైన బాధని మరువనీయకుము.
ఈ విషాద బాధా
ఛాయలను చైతన్య స్వప్నావస్థలలో
నన్ను భరించనిమ్ము.

# 80.

## వ్యర్థ జీవితం

నింగిలో నిరుపయోగంగా
సంచరించే శరన్మేఘపు
శకలంలా వున్నాను నేను.
ఓ శాశ్వత భాసాదిత్యా!
నీ స్పర్శతో నా ఆవిరిని
కరిగించి నీ కిరణములందు
సమ్మైక్యము గావించనైతివి.
కావున నీ నుంచి దూరమై
లెక్కించు చుంటి, నెలలు, యేండ్లు.

నీ అభీష్టం బిదే యగుచో
ఇదియే నీ క్రీడ అయినచో
క్షణికంబైన నా శూన్యతను
రంగులతో రంజిల్ల చేసి
దానికి బంగరు పూతపూసి
చిలిపి తెమ్మెరపై తేలించి
బహు చిత్ర విచిత్ర రీతులలో
దానిని విస్తరింప జేయుము.

ఆట ముగించ తలచిన రేయి
నిబిడాంధకారములో గాని,
శ్వేత ప్రభాత స్మితంలో కాని,
కాంతులు ప్రసరించే శీతల
నిర్మలత్వంబులోన కాని,
నేను కరిగి మాయ మవుతాను.

## 81.

## ప్రకృతి శోభ

ఎన్నో వ్యర్థ దినములందు
కరిగిపోయిన కాలంకై
దుఃఖముతో కుమిలి పోతిని -
కాని గడిచిన ఆ కాలం
వృధాగా పోలేదు ప్రభూ !
నా జీవిత ప్రతి క్షణాన్నీ
నీ హస్త సంరక్షణలో
అభయమిచ్చి కాపాడావు.

ప్రకృతి ఎదలో దాగి,
నాటిన బీజాలను
తొలకరి మొక్కలుగా,
లేత పసి మొగ్గలను
పరువాల పువ్వులుగ,
పుష్పించిన పూలను
రసమయ ఫలంబులుగ
చేస్తున్నావు ప్రభూ !

అలసిసొలసి పాన్పుపైన
పవళించి అన్ని పనులూ
స్తంభించినవని తలచితి.
కాని ఉదయాన్నే లేచి
రంగుల వసంతం వలే
పువ్వులతో నవ్వుతున్న
నా తోట యొక్క శోభని
గాంచి చకితుండనైతిని.

## 82.

## కడు దరిద్రులవము

స్వామీ ! నీ అధీనంలో కాలం అనంతం -
నీ క్షణాలను గణించగల వారెవరూ లేరు.

దివారాత్రులు గతించును, యుగాలు పూవుల వలె
వాడి పోవును. అయినా నిరీక్షించెదవు నీవు.
వన మల్లెకు వన్నె దిద్దుచు యుగయుగాలు గడిచె.

ఆలస్యము చేయలేము, వ్యవధి లేదు కనుకే
వచ్చిన అవకాశము చేజిక్కించు కొన వలెను.
ఆలస్య నష్టము తట్టుకోలేని పేదలము.

ఇవ్విధంబున కాలచక్రము గతించుచున్నది.
అడిగిన ప్రతి పేచీదారుని సంతృప్తి పరచు
ట వల్ల, నీ వేదిక నైవేద్య రహితమయ్యెను.

దివాంతమున నీ ద్వారము మూసెద రేమోయని
పరుగెత్తి వచ్చితి, కాని సమయమింకను కలదు.

## 83.

### జగన్మాత

తల్లీ, నా వేదనా భరిత
కన్నీళ్లతో నీ కంఠానికి
ముత్యాల మాలను అల్లెదను.

నీ పదముల అలంకరణకై
తారలు తమ కాంతి శిఖలతో
అందెలు ఆవిర్భవించాయి.
కాని నా హారం మాత్రమే
వ్రేలాడు నీ వక్షోజమున.

తరగని కలిమి కీర్తులకు
మూల కోశానివి నీవు,
ఇచ్చే దాతవు నీవే,
ఇవ్వని తల్లివి నీవే.
కానీ ఈ దుర్భర వ్యధ
నే సృష్టించిన సంపద.
దీనిని నైవేద్యంగా
నీ కర్పించిన వేళలో
నీ కటాక్ష వీక్షణలతో
నన్ను అనుగ్రహించెదవు

## 84.

## వియోగ దుఃఖము

నీ వియోగ దుఃఖ స్పందనము
భువనంబంతయు విస్తరించి
అనంతాకాశంలో జన్మ
నిచ్చును అనేక రూపాలకు.

రేయంతయును మౌనంబుగా
అనిమేష నయన దృక్కులతో
తార నుంచి తారను చూచుచు
ఆషాడ వర్ష నిశీధిలో
గలగలలాడే ఆకులలో
ధ్వనించే గేయ కవిత రవళి
ఈ అమిత వియోగ ఖేదమే !

ఈ పొంగి పొరలే బాధలే
సర్వ జన గృహ సీమల యందు
కాంక్షాను రాగాలుగా, సుఖ
దుఃఖాలుగా, రక్తి చెందును.
ఈ అమిత వియోగ ఖేదమే
నిరంతరం నా కవి హృదిలో
కరిగి పాటలై ప్రవహించును.

# 85.

## శాంతి యోధులు

తమ స్వామి ప్రాసాదము నుంచి
బయటికి అరుదెంచిన యోధులు
ఎక్కడ దాచిరి తమ శక్తిని ?
వారి ఆయుధము లేమైనవి ?
వారి కవచము లెచట నున్నవి ?

వారు బహు నిస్సహాయులుగా
కడు దీనముగా కనిపించిరి.
తమ ప్రభువు ప్రాసాదము నుంచి
వెలికి రాగానే వారిపై
కురిసె క్రూర అంబుల వర్షము.

తమ స్వామి ప్రాసాదములోకి
యోధులు తిరిగి వెళ్ళిన నాడు
ఎక్కడ దాచి తమ శక్తిని ?
వారు ఖడ్గము విసర్జించిరి.

విసర్జించె ధనుర్బాణములు -
విరిసెను శాంతము వారి నొసట.
తమ ప్రభువు ప్రాసాదములోకి
యోధులు తిరిగి వెళ్ళిన నాడు,
వదిలి వెళ్ళిరి జీవిత ఫలము !

## 86.

## నీ భృత్యుడు

ఓ ప్రభూ, నీ భృత్యుడైన మృత్యువు
నా తలుపు దగ్గర వేచివున్నాడు.
అతడు అజ్ఞాత వైతరణిని దాటి
నీ పిలుపును తెచ్చాడు నా ఇంటికి.

రాత్రి గాఢాంధకారంగా వుంది -
నా గుండెలో భయం అలుముకున్నది.

దీపం చేత బూని
ఇంటి తలుపులు తెరిచి
అవనత వదనుడనై
నీ వార్తా వహునికి
స్వాగతం పలికెదను.

అతనికి అంజలి ఘటించి
కన్నీటితో పూజించి
నా ఎదలోని సంపదను
అతని పదములందుంచెద.

తన కర్తవ్యంబును ముగించి
మరునాటి ఉషోదయంబునకు
నల్లటి నిస్తబ్ధపు నీడని
ఈ భూతలంబుపైన విడిచి
వెళ్లిపోతాడు నీ భృత్యుడు.
నిర్జనమైన నా గృహములో
పరిత్యక్త నా శరీరమును
నీకు ఆఖరి నైవేద్యముగ
సమర్పించుకుంటాను, ప్రభూ !

# 87.

## నీ మధుర స్పర్శ

ఃగించిన వెర్రి ఆశతో
ిళ్ళి వెదికాను ఆమెకై
ా గతి నలుమూలల యందు.
ాని ఆమె కనపడలేదు.

ా ఇల్లు చిన్నది.
ృహంబులో నుంచి
ోయిన దేనినీ
ిరిగి పొందలేను.

్వామీ ! అనంతము
ి దివ్య భవనము.
ఆమెను వెదుకుచూ
ిరలి ఏతెంచితి
ి తలుపు చెంతకు.

ంజ వెలుగులు నిండిన
ి ఆకాశము యొక్క
ంగరు పందిరి కింద
ిలిచి నా కాంక్షాయుత
ినులను మరలించితిని
ి దివ్య ముఖము పైకి.

ను తుదకు చేరితి
ఆద్యంతములు లేని
ాశ్వత అంచు కొనకు.
ఇచట నుంచి యేదీ
అదృశ్యము కాలేదు.

ఇచట ఆశ తరగదు.
ఆహ్లాదం కరగదు –
కన్నీళ్ళలో నుంచి
కాంచిన ముఖ దృశ్యము
సమసి అంతరించదు.

ఓ ప్రభూ ! అటువంటి
పారా వారములో
నా శూన్య జీవితము
కడ లోతుల వరకూ
ముంచి లేవనెత్తుము.
ఆ అనంత ప్రపంచ
పరిపూర్ణత్వంలో
నే పోగొట్టుకున్న
ఎంతో మధురమైన
ఆ స్పర్శానుభూతి
ఒకసారైనా, నను
అనుభవించనీయుము.

# 88.

## శిథిలాలయ మూర్తి

శిథిలాలయ శ్రీనివాసా !
విరిగిన విపంచిక తంత్రులు
నీ ఘనత చాటే శృతులను
మేళవించుటే మరచినవి.

సాయం సంధ్య వెలుగులో
నీ పూజా సమయంబును
సూచిస్తూ నినదించే
గంటల ఘణ ఘణ ఘోషలు
ఇక మీదట వినిపించవు.

నిశ్చల నిస్స్వన మారుతంబు
నీ చుట్టూ ఆవరించినది.
నీ నిర్జన నివాసంలోకి
విచ్చల విడి వసంత గాలులు
తెచ్చె, పువ్వుల సందేశమును -
ఇక పువ్వుల పూజలుండవని.

నీవు ఇవ్వని వరంబునకై
నీ పాత భక్తుడు ఆశతో
నిత్యమూ తిరిగుచువున్నాడు.
సంజవేళలో వెలుగునీడలు,
ధూళి చిమ్మిన చీకట్లలో
ఐక్యమైన వేళ ఎదయందు

ఆశ నింపుకొని అలసటతో
నీ శిథిలమైన గుడి చెంతకు
ఏతెంచు నీ దీన భక్తుడు.

శిథిలాలయ శ్రీనివాసా !
ఎన్నో పండుగ దినంబులు
ఏ సడీ సవ్వడీ లేక
ఏతెంచి నిష్క్రమించినవి.
జపతపాల రాత్రులెన్నో
ధూప దీప నైవేద్యములు
కరువై గతించి పోయినవి.

మేటి శిల్పకళా ప్రవీణులు
పాషాణమునకు ప్రాణమిచ్చి
ఎన్నో నవ్య రూపాలలో
మలిచారు నీ విగ్రహములను.
కాలము చెల్లిన తదుపరి, ఆ
గుండెలే లేని దేవుళ్లను
విస్మృత పవిత్ర వాహినిలో
నామ రూపాలు కరిగేలా
జలకాభిషేకం చేస్తారు.

కానీ, శిథిలాలయ మూర్తీ !
నీవు మాత్రం పూజలు లేక
కఠిన నిరాదరణకు లోనై
శూన్యంగా మిగిలి పోయావు

# 89.

## నిరర్థక జీవితం

కపై అరుపులు కేకలు నా
ఎబు నుంచి వినిపించవు.
అలా ఉండమనే ప్రభువాజ్ఞ.
ఇక ముందు గుస గుసలతోనే
నా సంభాషణ సాగించెద.
పాట యొక్క ఆలాపనగా
నా హృదయ భాష పలుకుతుంది.
రాచ వ్యాపార కేంద్రమునకు
త్వరగా పోతున్నారు ప్రజలు.
క్రయ విక్రయ దారులందరూ
విపణి వీధిలో గుమిగూడిరి.
పని ఎద్దడిలో, మధ్యాహ్నము,
సమయమునకు పూర్వమే, సెలవు
లభించె నాకు విధి వశంబున.

వేళ కాని వేళలో విరులు
వరియనీ, నా పూదోటలో.
మధ్యాహ్నవేళ సోమరిగా
తిరిగే మధుపములు చేయనీ
ఇంపైన ఝుంకార రవళులు.

మంచి చెడుల పోరాటంలో
నా జీవితం గడిచి పోయెను.
ఇప్పుడు నా వ్యర్థ దివసముల
పూర్వ సఖుడు ఆకర్షించెను
నా హృదయుంబును తనవైపుకు.
ఏ ప్రయోజన రహిత నిరర్థ
వ్యాపకానికై హఠాత్తుగా
ఇలా పిలిపించెనో ఎరుగను !

# 90.

## మృత్యు దేవతకు కానుక

మృత్యువు నీ ద్వారము తట్టిన
రోజున ఏమిచ్చెద వతనికి ?

నాకు అతిథిగా ఏతెంచిన
మృత్యుదేవుని ముందుంచెదను
నా పూర్ణ జీవిత కలశమును.
ఏ నాటికీ అతనిని రిక్త
హస్తాలతో తిరిగి పంపను.

జీవితాంతమున మృత్యువు నా
ద్వారము తట్టిన తరుణంలో,
నా శరత్ దినములందు, గ్రీష్మ
రాత్రులయందు, పొందు పరచిన
మధురామృత ద్రాక్షాసవమును,
నా జీవితంలో ఆర్జించిన
సమస్త సంపదలను, మృత్యువు
సమక్షమందు సమర్పించెద.

# 91.

## మృత్యు ఒడిలోకి

ఓ, మృత్యువా ! జీవితానికి
చివరి లక్ష్యం నీవే కదా.
నా మృత్యువా ! త్వరగా వచ్చి
నా చెవిలో గుసగుసలాడుము.

దిన దినంబులు నిరీక్షించితి -
భరించితిని సుఖ దుఃఖములను -
అంతా నీ కొరకై చేసితి.

నా ఆశలు, సంపదలు, ప్రేమ
నా సర్వస్వము నీ దెసకే
ప్రవహించెను రహస్యంబుగా -
నీ కనుల అంతిమ చూపుతో
నా ప్రాణమె నీదే పోవును.

పువ్వులన్నీ అల్ల బడినవి,
వరుడికై మాల సిద్ధమైనది -
కళ్యాణానంతరం, వధువు
గృహము వీడి, ఏకాంత రాత్రి
కలియు తన స్వామిని ఒంటరిగ.

## 92.

# నిగూఢ నిక్షేపములు

ఈ బుద్బుద లోకాన్ని
వీక్షించే నా కనులు
మూతలు పడే దివసము
త్వరలో వస్తుందనీ,
ఆ కన్నులపై తెరను
దింపి, జీవితం సెలవు
తీసుకోబోతుందని
నాకు తెలుసులే, ప్రభూ !

అయినా ఎప్పటి లాగే
రాత్రిలో నక్షత్రాలు
నిద్రమేల్కొని కాపలా
కాచుతూనే వుంటాయి.
సూర్యుడు మునపటి వలెనే
ఉదయించును తూర్పు దిశన.
ఘడియలు కెరటంబుల వలె
ఉవ్వెత్తున ఉప్పొంగుచు,
జీవిత సుఖ దుఃఖాలను
విసిరి వేస్తూ వుంటాయి.

ఇదే నా జీవిత అంతిమ
క్షణాలను గ్రహించగానే
ఆ క్షణముల భీతావహము
అంతమై మృత్యు దీప్తిలో
తిలకించెద నీ అరక్షిత
నిక్షేప నిధుల లోకాన్ని.
అందులోని అదమాసనం
ఎంతో అసమానమైనది.
అందులోని నికృష్ట ప్రాణి
ఎంతో అపురూపమైనది.

నేను కాంక్షించి పొందని
నే కాంక్షించక పొందిన
ధన కనక వస్తువలన్నీ
నా నుంచి తరలి పోనీ,
నేను నిర్లక్ష్యం చేసి
సర్వత తిరస్కరించిన
గూఢ నిక్షేపములనే
నన్ను పొందనీయి ప్రభూ !

# 93.

## అంతిమ ప్రయాణం

నా ప్రియ సహోదరులారా !
తుది సెలవు దొరికింది నాకు -
నాకు వీడ్కోలు చెప్పండి,
మీకు ఇదే నా వందనం.
ఇక నేను వెళ్లి వస్తాను.

ఇవిగో, తీసుకోండి మీరు
నా తలుపుల తాళం చెవులు -
ఈ ఇంపు సొంపు ఇంటిపై
నాకున్న హక్కులనంతా
వదిలి వెళ్లి పోతున్నాను.
కడసారిగా మీ నుంచి
నే కోరుకునేదెల్లా
మీ హృదయములో పొంగే
మమతలు నిండిన పలుకులు.

బహు కాలము ఇరుగు పొరుగున
కలిసి మెలసి జీవించాము.
నేను ఇచ్చింది కొంచెమే -
మీరు పంచింది ఎక్కువే.

ప్రభాతం ప్రభవించింది.
నాగది చీకటి మూలాలను
ప్రకాశవంతము చేసిన
దీపము ఆరిపోయింది.
అంతిమ ప్రయాణానికై
సిద్ధముగా వున్న నాకు
రమ్మని పిలుపు వచ్చింది.

# 94.

## అంతిమ వీడ్కోలు

నా ప్రియ మిత్రులారా -
మిము వీడి వెడలుచున్న
ఈ దుఃఖ సమయములో
మీ శుభాకాంక్షలతో
నన్ను సాగనంపండి.
చీకట్లు చీలుస్తూ
ఆకాశ వీధిపైన
ప్రభాతోదయమైనది.
ఆ కాంతుల వెలుగులో
నే పయనించే బాటచ
మనోహరముగా వుంది.

నే పోవుచున్న
ఆ లోకానికి
నా వెంట ఏమి
మూట కట్టుకొని
పోవు చుంటివని
నన్నడగకండి.
ఉట్టి చేతులతో
ఆశలు పొంగే
అమృత హృదయముతో
వెళ్లుచున్నాను.

పరిమళాలు పంచే
పెళ్లినాటి పువ్వుల
హారాన్ని ధరియించి
యాత్రికుడు ధరించే
కాషాయ వస్త్రాన్ని
విసర్జించితి నేను.
నే పోవు దారిలో
అపాయములున్నవని
గ్రహించి నప్పటికీ
మదిలో భయం వీడి
పోవుచుంటిని నేను.

నా అంతిమ యాత్ర
ముగిసిన క్షణంలో
సంధ్య నక్షత్రము
మెఱయుచు జన్మించు
సంధ్యా రాగాల
విషాద స్వరంబులు
మ్రోగును వికలముగ
రాజ ద్వారములో.

# 95.

## పునర్జన్మ

మర్త్యలోక ఇరులను దాటి
పుణ్య తల్లి పురిటిని దాటి
నర జన్మ కవాటంబులను
చరచి తెరచిన శుభ ఘడియలు
జ్ఞప్తికే రావాయె నాకు.

అర్థరాతిరి అడవియందు
విచ్చుకునె ముగ్ధ మొగ్గలా
ఈ అద్భుత జగత్తులోకి
ఏ శక్తి పుట్టించినదో !

పుట్టిన వెంట వీక్షించిన
ప్రభాత పసిడి వెలుతురులో
రికించి నే కనుగొంటిని –
ఈ చిరపరిచిత ప్రపంచం
గా తెలిసిన దేననీ,
మములేని నిరాకార
ర్క వితర్కాల కందక
లరారే ఆది శక్తే
తృమూర్తి రూపంబులో
న స్వహస్తాలలో నన్ను
దుకుందని గ్రహించితిని.

త్యువు సన్నిధిలో సహితం
ఈ అపరిచిత ఆదిశక్తి
నాకు చిరపరిచితురాలై
నన్నలరించి ఓదార్పును.
ప్రేమిస్తాను జీవితాన్ని.
అందుకే మృత్యువుని సైతం
ముదముతో ప్రేమించగలను.

కుడి స్తనమును కుడుచు శిశువును
తప్పిస్తే, తల్లి ఒడిలో
రోదించే ఆ శిశువు, మరు
క్షణమందు ఎడమ స్తనములో
ఓదార్పును పొందాను కదా !

# 96.

## నా తుది సందేశము

ఈ ధరిత్రిని వీడి
స్వప్న లోకంబునకు
నే [illegible] పోతున్న
[illegible] క్షణంలో
[illegible]ంచిన
అద్భుత దృశ్యాలకి
సాదృశ్యము లేదని, నే
[illegible] సత్యం. నా
తుది సందేశంగా
జగతిలో నిలవనీ.

పాలంటి కడలి మీద
[illegible] విచ్చిన
కమల పుష్పాలోని
[illegible]మధువు గ్రోలి
[illegible] నైతిని.
[illegible]
[illegible]
[illegible]

[illegible]
[illegible]లో
నా [illegible]యం ముగిసింది.
ఈ బుద్బుద వేదికపై
వీక్షించాయి నా కనులు
నిరాకార నిఖిలేంద్రుని.
అందని స్వర్గంపై
ఉన్న అంతర్యామి
స్పర్శానుభూతితో
నాలో అణువణువూ,
నా సర్వాంగములూ,
త్రుళ్ళి పులకించాయి.
ఇక మృత్యువు వస్తే
రమ్మనవోయ్, దానిని!
ఈ పసిడి పలుకులే
నా తుది పలుకులుగా
జగతిలో నిలవనీ.

# 97.

## విరాట్రూపము

నేను నీతో ఆడుకునే కాలంలో
నువ్వు ఎవరవని నేను ప్రశ్నించి లేదు.
అప్పుడు బిడియ భయంబులు ఎరుగను నేను -
జీవితము జవసత్త్వ ఉత్సాహ భరితము.

నా ఆప్త సహచరుడివలె ఉషోదయాన
నిద్రలేపి వనాంతర వెలుగు నీడలలో
పరుగెత్తి నాకు దారి చూపెడి వాడివి.

నీవు నాకై పాడిన పాటల అర్థము
తెలిసి కొనుటకై ఆ రోజులలో నేను
తీవ్రంగా ప్రయత్నమైన చేయలేదు.
నీదు పాటల రాగాలను నా కంఠము
అనుకరిస్తే వాటి లయకు నా హృదయం
పొంగి ఆనందముతో నాట్యమాడేది.

ఆటలన్నీ పూర్తియైన సమయంలో
ఎంత వింత దృశ్యము నా [illegible]
నిఖిల విశ్వమంతా [illegible]
నీరవ నక్షత్రముల సముదాయముతో
నీ పాదాలపైన దృష్టి నిలిపి నిలిచె !

## 98.

## పరాజయము

నా విజయ సూచిక చిహ్నములు,
నా పరాజయ హారంబులను,
నీకు వేసి అలంకరించెద -
నీ చేత ఓడిపోకుండా
తప్పించుకొనడము అసాధ్యము.

అందలం బెక్కిన నా అహం
సమసి సమాధి అవుతుందనీ,
బంధించిన బహుబంధాలను
నా జీవితం, బాధల బాకు
ధారలతో తెంచునని తెలుసు.
నా శూన్య హృదయ విలాపములు
గాలి స్పర్శించిన రెల్లులా
సంగీత స్వరము లాలపించ,
శిలలు కూడ కన్నీట కరుగు.

ముకిళితమైన పద్మము యొక్క
శతపత్ర మృదు ధవళరేకులు
కల కాలం విరియక వుండవు.
అది తన గర్భములో దాచిన
మధుర మకరంద గుప్త గహన
ద్వారంబులను తెరచి తేనెల
భాండారమును ప్రదర్శించును.

నీలి నింగి ముసుగులో నుంచి
నిటలాక్షుని కటాక్ష నేత్రం
దయతో నాపై దృష్టి నిలిపి
మౌనముగా చెంతకు రమ్మని
మూగ పిలుపులతో పిలవగా
భువిలో నాకేమీ మిగలదని
ఎరింగిన నేను ఎదురాడక
నీ పాదము లు ప్రసాదించిన
మృత్యువు కౌగిటిలో చేరెద.

# 99.

## ఆహ్వానము

నే చుక్కాని వీడిన నాడు
నీవు ఓడకు చుక్కానివై
దారి చూపి దరిచేర్చెదవని
నాకు తెలుసులే మహా ప్రభూ !
కాబోవునది కాక మానదు.
ఈ సంఘర్షణ నిరర్థకము.

ఈ సత్యం తెలిసిన మనసా,
గుండెనదిమే చేతులు ఉంచి
పరాజయపు పరాభవంబును
సహనముతో అంగీకరించి
ఉన్న స్థానములో స్థిరముగా
ఉండుట భాగ్యమని తలంచుము.

వెలిగే నా దీపాల శిఖలు,
వీచే ప్రతి పిల్ల గాలికీ
కంపించి కనుమూస్తూ వుంటె
దివ్వెలను వెలిగించాలనే
జీవిత తాపత్రయంబులో
అన్నింటినీ మరచితి ప్రభూ !

కాని ఈ తుదిసారి మాత్రము
తెలివిగా చీకటి మూలలో
నేల పైన నా చాపను పరచి
నీకై నిరీక్షించెద, ప్రభూ !
నన్ను కటాక్షించ దలంచిన
ప్రసన్నతా శుభ సమయంలో
అడుగుల సవ్వడి లేకుండా
వచ్చి నా దగ్గర కూర్చొనుము.

## 100.

## మౌన వీణ

నీ నిరాకార స్వాతి
ముత్య సముపార్జనకై
అనంతాకార కడలి
లోకి దూకి వెదికితిని.

ఈ శిథిల పడవపై
రేవు రేవుకి ఇంక
నే పయనించలేను.
అలలపైన ఆడే
రోజులు బహు కాలం
క్రిందటే ముగిసినవి.

ఇప్పుడు మృత్యు రాహిత్యంలో
మృతి చెందాలని ఆసక్తిగా
ఎదురు చూస్తూ వున్నాను నేను.

అగాధ లోతుల అంచున వున్న
ప్రేక్షక సభాస్థలిలో స్వరరహిత
తీగెలపై మ్రోగే సంగీత
ఝరి ఉద్ధృతంగా పెల్లుబుకునో
అచటకు ఈ జీవిత తంబురను
వెంట తీసుకొని వెళ్లేవు, ప్రభూ!

నిత్యమూ మ్రోగే స్వరాలతో
నీ వీణను శ్రుతి చేసి అంతిమ
విలాప స్వరము మ్రోగిన తదుపరి
ఈ నా మౌన వీణను ఉంచెద
నీరవమూర్తి పాదముల చెంత.

# 101.
## నా కీర్తనలు

జీవితంలో నిరంతరం
నా కీర్తనల ద్వారా నిను
అన్వేషించాను స్వామీ !
ఇంటింటికి ఈ పాటలే
నన్ను పయనింప చేసినవి.
ఈ పాటల సహాయముతో
నా చుట్టూ తడుముకుంటూ
నా ప్రపంచాన్ని వెతుకుతూ
స్పృశిస్తూ కనుగొనగలిగితి.

నా భక్తి భరిత పాటలే
నేనెన్నడూ నేర్చుకోని
పాఠములన్నీ నేర్పినవి.
నాకు తెలియని పెక్కు గుప్త
మార్గములను చూపించినవి.
హృదయ గగనం పై మెరిసే
విభిన్నతారా శ్రేణులను
నా కనుల ఎదుట నిలిపినవి.

దినమంతా, సుఖ దుఃఖాల
లోకము యొక్క అద్భుతముల
వెనక దాగియున్న మర్మము
వైపు దారి చూపించినవి.
నా యాత్రముగిసే సంధ్యా
సమయంలో, నను చేర్చినవి
నీ రాజ ద్వారము చెంతకు

# 102.

## నీవు

నిస్సారుగుదునని ప్రజల ముందు
ప్రగల్భాలు పలికితిని నేను.
నేను గీసిన బొమ్మల యందు
నీ ప్రతి బింబమును గుర్తించి
'ఎవరు ఇతను ?' అని ప్రశ్నించిరి.
ఏమి చెప్పవలెనో ఎరుగక
'నాకు తెలియదని' జవాబివ్వ,
నను దూషించి క్రోధంబుతో
మరలి పోయెదరు వారంతా -
నీవు మాత్రము అచట కూర్చొని
నవ్వుతూ చూస్తూ వుంటావు.

నీ యొక్క మహిమలన్నింటిని
అమర గీతాలుగ మలిచాను.
నీ నిగూఢ నాదం నా ఎద
చీల్చి జనుల వీనులు సోకగ
వాటి అర్థము వివరించమని
నా కడ కొచ్చి వేడు కొందురు.
ఏమి చెప్పవలనో తెలియక
'ఎవరి కెరుక వాటి అర్థాలు ?'
అని నేను ప్రశ్నించగ, వారు
నన్ను అపహసించి క్రోధముతో
కంపిస్తూ తరలి పోయెదరు.
నీవు మాత్రము అచట కూర్చొని
నవ్వుతూ చూస్తూ వుంటావు.

# 103.

## ఒకే ఒక్క నమస్కారము

నా ఈ ఒకే ఒక్క నమస్కారముతో
నా ఇంద్రియ స్ఫూర్తి ఇలపై విస్తరించి
నీ పాదాబ్జములను స్పృశించనీ ప్రభూ !

కురియని నీటి భారంతో భూమి పైకి
వంగిన ఆషాఢ వర్షమేఘం వలె
నా పూర్ణ మనస్సు నీ ద్వారము దగ్గర
మోకరిల్లి నమస్కరించనిమ్ము ప్రభూ !

నా గీతాలు తమ విభిన్న రాగాలను
మేళవించి ఏక ఝరీప్రవాహంలా
మలచి ఒకే ఒక్క నమస్కారంబుతో
నీరవార్ణవంలోకి పారనీ ప్రభూ !

ఇంటి పై బెంగ పెట్టుకొని తమ పర్వత
గూళ్ళకు రాత్రింబవళ్ళు ప్రయాణించే
కొంగల గుంపులా నా జీవితము కూడ
ఈ నమస్కారముతో ఆద్యంతము లేని
తన శాశ్వత గృహమునకు పోనిమ్ము ప్రభూ !

# 103.

## ఒకే ఒక్క నమస్కారము

నా ఈ ఒకే ఒక్క నమస్కారముతో
నా ఇంద్రియ స్ఫూర్తి ఇలపై విస్తరించి
నీ పాదాబ్జములను స్పృశించనీ ప్రభూ !

కురియని నీటి భారంతో భూమి పైకి
వంగిన ఆషాఢ వర్షమేఘం వలే
నా పూర్ణ మనస్సు నీ ద్వారము దగ్గర
మోకరిల్లి నమస్కరించనిమ్ము ప్రభూ !

నా గీతాలు తమ విభిన్న రాగాలను
మేళవించి ఏక ఝరీప్రవాహంలా
మలచి ఒకే ఒక్క నమస్కారంబుతో
నీరవార్ణవంలోకి పారనీ ప్రభూ !

ఇంటి పై బెంగ పెట్టుకొని తమ పర్వత
గూళ్ళకు రాత్రింబవళ్ళు ప్రయాణించే
కొంగల గుంపులా నా జీవితము కూడ
ఈ నమస్కారముతొ ఆద్యంతము లేని
తన శాశ్వత గృహమునకు పోనిమ్ము ప్రభూ !